# పద్మిని

(ఆఱంకముల కల్పితనాటకము)

పానుగంటి లక్ష్మీనరసింహారావుచే

రచియింపఁబడినది.

మొదటికూర్పు 1000 ప్రతులు.

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1929



[వెల 0-12-0

శ్రీరామ.

# పీఠిక.

---

ఈ పద్మిని నా పందొమ్మిదవ నాటకము. దీనిలోని కథ కల్పితము. శ్రీశ్రీ పీఠికాపురాస్థాన మహారాజావారు దీని నచ్చువేయించిరి. వారికి వారికుటుంబమునకు భగవంతుఁడు సర్వశ్రేయముల నిచ్చుఁగాక !

నా మిత్రులగు బ్రహ్మశ్రీ కూచి నరసింహముగారు దీనికి నాందీ ప్రస్తావనలను వ్రాసియిచ్చినారు. ఆయన కనేకనమస్కారము లర్పించుచున్నాను.

పీఠాపురము,
5-10-29.

పా॥ లక్ష్మీనరసింహ రావు.

---

# ఇందలి పాత్రలు.



### పురుషులు

మురళీమనోహరుఁడు—కళింగరాజపుత్రుఁడు—పద్మినిని ప్రేమించినవాఁడు.

విజయనారాయణవర్మ—రత్నప్రభను వరించినయాతఁడు.

గోపాలవర్మ—రత్నప్రభతండ్రి—నారాయణవర్మ మేనమామ.

### స్త్రీలు.

పద్మిని—సౌభాగ్యనగరపురాణి—కథానాయిక.

రత్నప్రభ—గోపాలవర్మపుత్రిక.

మాలిని—పద్మినిదాసి.



శ్రీరామ

# పద్మిని.

## నాంది.

---

చం. మనసిజుప్రేరణ జ్జలువు । మాయలు, పిమ్మట నాత్మకుప్రక్రియా
జనితమహానుతాపశిఖి; । స్వాంతమున న్వనితానురక్తి, పై
కనువగు సాధువేష;— మిటు । లద్భుతలీలల నొప్పు సర్వసృ
ష్టిని గనరాక త్రిప్పుచు నటించెడు రాముఁడు మిమ్ముఁ బ్రోవుత !

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—కథానాయిక యగు కాంత పురుషుఁ బ్రమించిన పటు మస్వభావురాలును, గపటికశిఖామణియు నైనప్పుడు, నటి నేల పిలువవలయును? బావా పారిపార్శ్వకా!

పా—[ప్రవేశించి] ఏమిసెలవు?

సూ—పిలుచువాఁడను నేనును బిలువఁబడినవాఁడవు నీవును నైనప్పుడు, ప్రయోజనము నాటకప్రదర్శనముగాక యున్య మేమై యుండును?

పా—ఎవరినాటకము? ఏనాటకము?

సూ—

సీ. ఆంధ్రాంగ్లభాషల । నారితేఱినవాఁడు,
పరిపక్వలోకానుభవమువాఁడు;
క్యంబునకు హృద్యశబ్దమాధురిఁగూర్చి
సుకవితాచతురతఁ । జూపువాఁడు;

భావంపుటూటల । భావియూబుద్ధి వా౦,
డంచితోపమల గుప్పించు వాఁడు;
నిర్ఝరపాతసన్నిభ వాణిగలవాఁడు,
పలుకుపలుకున హాస్య । మొలుకువాఁడు;

గీ. సాత్త్వికవ్యాసముల నాంధ్రజనులనెల్ల
హర్షవివశులఁ జేసెను । నట్టివాఁడు;
మేటియగు పానుగంటి లక్ష్మీనృసింహ
రావు, భావ! నాకటమును । వ్రాసినాఁడు.

పా—అలాగునవా ? కుశీలవబృందమున కాయన చిరపరిచితుఁడైన ప్రఖ్యాతనాటకకర్తయే! కవివయసెంత ?

సూ—నూటేండ్లకును అఱువదినాలుఁగుం. అట్లడిగినా వేమి ?

పా—వార్ధకమువలన వపుర్బలముతో బుద్ధిపాటవముగూడ జంకునే మోయని!

సూ—శరీరసత్త్వమించుక జంకిన జంకుఁగాక, బుద్ధిబలము మాత్ర మెప్పటియట్లే యున్నది. ఆమాట నేఁజెప్పనక్కఱలేదు. నేఁడు ప్రదర్శించుటకుఁ బరనార్థము మీ కిచ్చిననాటకమే చెప్పఁగలదు.

పా—ఏమీ! అదేనా మన ప్రస్తుతప్రస్తావనావిషయమైననాటకము?

సూ—ఔను.

పా—అట్లైన, నాయునుమానము నిరాధారము.

గీ. పూర్వనాటకముల రసపుష్టితోడ
నేమొలర్చుచునున్నది । యిదియుఁగూడఁ;
గడుమనోహరమగు కథాకల్పనంబు
ప్రస్ఫుటంబుగఁ జూపట్టు । భావ! యిటను.

సూ—

గీ. వయసు గడచిన కొలఁదిని । వన్నెకెక్కు
వస్తువులు కొన్నిగల యీప్రపంచమందు
వంటమందులు ద్రాక్షాసవంబు—నిట్టి
వానిలోనిదె సూ! కవిత్వంబుగూడ.

అదియుఁగాక—

గీ. రసికుఁడు సుదాత్తుఁడో మహారాజపోష
ణంబునను జిత్తశాంతి నందఁగాంచు
కవికి, వార్ధక మాత్మబంధు ప్రకరముఁ
గాని యెవ్వఁడు శత్రువు । గాఁడుసుమ్మి!

పా—అట్టైన మొదలఁ, బోషితుఁడగు పోషకుఁడునుగూడఁ జిరాయు రారోగ్యయశస్సంపన్నులై యుందురుగాక!

సూ—తథాస్తు!

పా—సరియే కాని, మీ రీనాటకము కవిరచించిన నాటకములలో నెన్నవ నాటకమో, దానిపేరేమో, యింకను జెప్పినారు గారు.

సూ—(నవ్వుచు) బాబా! అడిగినవెంటనే యది కవియే చెప్పలేక పోయినాఁడు. నాటకపటిమఁ బట్టి యది యాయన జ్ఞాపకశక్తి లోపమని చెప్పలేముగదా! ఇఁక నాదోషమంతయుఁ దత్స్వార్వకృత నాటకగ్రంథ సంఖ్యాబాహుళ్యమున కంటఁగట్టకతీఱదు.

పా—కవిపరిహాసప్రియత్వ మిప్పుడుఁగూడ నంటుకొన్నట్లున్నది. వేళాకోళములు గట్టిపెట్టి యడిగిన ప్రశ్నకుఁ బ్రత్యుత్తరము సెలవిండు.

సూ—పందొమ్మిదవ నాటకము—పేరు పద్మిని—నాయికానామము ను నాటకనామమును నొక్కటియే

పా—పేరుమంచిదేగాని తీరుమంచిదిగాదు. నాయిక మహాకంటకు రాలు.

సూ—ఆమె యెట్టిదైన నీకేమి? ప్రదర్శనమునకు సర్వము సిద్ధముగా నున్నదికదా?

పా—ఉండకేమి? మీరు సిద్ధసంకల్పులు. తలచుకొన్నపని కాకపోవునా?

(తెరలో) తలచుకొన్నపని కాకపోవునా?

సూ—అవిగో! పద్మినీవాక్యము లప్పుడే వినఁబడుచున్నవి. నాటకము ప్రారంభమైనట్లున్నది. మన మింకఁ బోవుదము రమ్ము!

(ఇద్దఱు నిష్క్రమింతురు.)



# పద్మిని

ప్రథమాంకము.



ప్రదేశము:—సౌభాగ్యనగరము - అంతఃపురము.

[ప్రవేశము:—పద్మిని.]

పద్మి—తలఁచుకొనినపని కాకపోవునా? కాకపోవుటకు లోపమేమి? ధనలోపమా? అధికారలోపమా? ఉత్సాహలోపమా? బలలోపమా? ప్రయత్నలోపమా? ఏలోపముఁగూడ నున్నట్లులేదే? ఇఁకఁ గాకపోవుటయెట్లు? మాలినీ! మాలినీ!

మాలి—[ప్రవేశించి] అమ్మా! ఏమిసెలవు?

పద్మి—ఆతఁడు వచ్చినాఁడా?

మాలి—ఇంకరాలేదు.

పద్మి—రాకపోయినయెడల నీ వేలవచ్చితివి? నీపనికిమాలినమొగముఁ జూచుటకే నిన్నుఁ బిలిచితి ననుకొంటివా? పో-పోయి యాతనిజాడఁ గనుఁగొనిరమ్ము. (మాలిని పోఁబోవును.) ఇదిగో చూడు. నీవు తిరుగ రానక్కఱలేదు. ఆతని నిటకుఁ బంపుము. తెలిసినదా? అట్లు తేఱిపాఱఁజూచెదవేమి? ఇందునఁ దప్పేమున్నది. ఆతఁడొక్కఁడు నిచ్చట నాతో మాటలాడఁగూడదా? నీవుండినఁగాని మాసంభాషణమునకు గౌరవమును, ఘనతయుఁ గలుగవని యనుకొంటివా? నేను మహారాజ్ఞిని. ఆతఁడు సామంతరాజులలో నొక్కఁడు. సామంతరాజుఁగూడఁ గాఁడు. ఆతని బంధుఁడఁట. ఎవఁడైననేమి?

అదిగో! మొద్దులాగున నట్లు నిలువఁబడెద వేమి? నీసందేహామే మో చెప్పక గుక్కిళ్లుమ్రింగుచు గుడ్లుపెట్టుకొని యట్లు చూతు వేల?

మాలి—అమ్మా! నేను మాటలాడవచ్చునా ?

పద్మి—మాటలాడకుండ-మాటలాడకుండ-నీనోరుమూసితినా? అయి నను నీవు మాటలాడవలసినయావశ్యకత యేమున్నది? ఇదివ ఱకే యనవసరముగ చనవుదీసికొని యిందుగూర్చి నాకె న్నిపర్యాయములో యడ్డుచెప్పితివి. నీవు మాటలాడనక్కఱ యే లేదు. నీవు నాకు సేవఁజేయవలసినదానవు కాని నన్ను దిద్ద వలసినదానవు కావుగదా! అదిగాక, నేనేమైనఁ దప్పుఁజేయు చుంటినా? ఆతఁడు నాదర్శనమునకు వచ్చెదననినాఁడు. అది గో! తల యడ్డముగ నూపెద వేమి? ఆతఁడు నాదర్శనమునకు వచ్చెదనని చెప్పుట యసత్యమనియా? ఔఁ. అసత్యమే యగుఁగాక నేనే ముందాతనికి నాదర్శనమునకు రమ్మనివార్త నంపితిని. నిజమే. అందుపై నాతఁడు వచ్చెదననినాఁడు. రానీ- ఏవో నాల్గుమాటలు మాటలాడి సెలవిచ్చి పంపెదను.దీనికింత పూర్వపక్షరాద్ధాంతము లేల ? నీమొగము మాడుపు, మూఁతి ముడుపు లేల? నీవిప్పుడే పోయి యాతని నిటఁబంపుము. కిక్కురు మనకుండఁ బొమ్ము. (మాలిని పోఁబోవును )

పద్మి—చూడు. ఇదివఱకే రావలసినవాఁడుకదా? ఇంతవఱకేల రా కుండెను! ఎక్కడ నేమిచేయుచున్నాఁడో నీకేమైనఁ దెలి యునా?

మాలి—ఏమో నాకెట్లు తెలియును?

పద్మి—ఏమో నాకెట్లు తెలియునని వంగనాచివలెఁ బల్కుచు త్తర మిమ్మని విన్నదుగ లేదు. ఏలరాలేదోయని నన్ను నేను పృచ్ఛిం

చుకొంటిని. తెలిసినదా? ఆతనినిగూర్చి నే నాందోళన మొం
దుచుంటినని నీ వనుకొనుచుంటివి కాఁబోలు! ఆతఁడు వచ్చిన
సరియే. రాకున్న సరియే. నా కాగణన మింతమాత్రము లేదు
సుమా! మహాధికారిణినైన నన్నుఁ జూచుటకు వచ్చుచున్న
వారిలో నాతఁ డొక్కఁడు. నేనేమో యాతనియందు విశేష
మారోపించితినని నీ వనుకొనుచున్నావు కాఁబోలు! ఎదుటి
చిత్తమునుఁ గనిపట్టుట కెంత తెలివియుండవలయును? నీవు
పెద్దదానవు. నీవంటిదానికిఁ దెలివి తీక్ష్ణముగా నుండుట కవకా
శము లేదు. నీవయస్సువారికిఁ బనికిమాలినసందేహములు,
కారణము లేని భ్రాంతులు, ననావశ్యములైన యాలస్యములు
ప్రబలముగా నుండును. మా కవియేవియుఁ గిట్టవు.

మాలి — నిజమే. పడుచువారికిఁ దొందరపాటులు ముసలివారికిఁగూడఁ
గిట్టవమ్మా!

పద్మి — నీకు బుద్ధిలేదా? నా కెట్టితొందరపాటును లేదని నీతో నెన్ని
సారులు చెప్పియుండలేదు. మాటవరుసకుఁ దొందరపాటున్న
దనియే యెంచుము. నీకు నావయస్సున నీమాత్రపుఁ దొందర
పాటు లేదని నీవు ప్రమాణముఁ జేసి చెప్పఁగలవా? నాకున్నట్లు
పదునెనిమిదేండ్లవయస్సు సర్వాంగసౌందర్యము, మహాధి
కారము, మహారాజ్ఞీపదవి, మహాబుద్ధివిభవము, సర్వస్వాతం
త్ర్యము నీకున్నయెడల, నీవు నామాత్రపుఁ దొందరపాటుతో
సరిపుచ్చియుందువా? మింటికెగిరి పేఁకజువ్వవలె మిడిసిరాల
కుందువా? అయిదుపదులు నెత్తిమీఁదికివచ్చి యున్నియు నుడి
గియుంటచే నీవు నాకు ధర్మపన్నములు చెప్పుచున్నావు. నీ
త్యుపన్యాసము లిచ్చుచున్నావు. నీమాటలు నాచెవి కెక్కవు.
ఎక్కవని యిదివఱ కెన్నిసారులో చెప్పితిని. అంటుకొన్న

తుపాకికిఁ బ్రేలవలదని చెప్పుము. మేఘమునకు బడబడలాడ వలదని చెప్పుము. అంతేకాని నాతోఁ జెప్పెదవేల? చాలుఁ. చాలు. పో. పో.

మాలి—అమ్మా! పోయెదనుగాని తలుపుచాటునఁ గూరుచుండియే యాతనితో మాటలాడవలయునుజుమా! అమర్యాదను మాత్రము మీఱవలదు దానివలన ముందెన్ని చిక్కులున్నవో మీ రాలోచించుకొనవలయును?

పద్మి—ప్రపంచస్వభావము నాకంటె నీకెక్కువ తెలియదు. నీకు వార్ధకము వచ్చినది కాని ప్రపంచజ్ఞానము రాలేదు. చిక్కులని జడిసినకొలఁది సందేహించినకొలఁదిఁ జిక్కులెక్కువయగును. విధేయునిమీఁదనే ప్రభుప్రవారియగును మెత్తనివానికే మొట్లెక్కువ జడిసినకొలఁది సాంక్రామిక వ్యాధివచ్చును. ప్రపంచసౌఖ్యమునకు మొండితెంపంతటి సులభమార్గము మఱేదియు లేదని నానమ్మకము.

మాలి—అమ్మా! అంతసాహసమా? మీకుఁ గాఁదలఁచిన భర్తగారి సంగతి రవంత యాలోచింపనక్కఱలేదా?

పద్మి—ఛీ ఛీ. ఆసంగతి నీకెందులకు? అది యిప్పుడేల ప్రస్తావించితివి. దానికి దీని కేమిసంబంధమున్నది? ఉన్నదేయనుకో. ఆ సంగతి చెప్పవలసిన దానవు నీవా? నీవెవతెవో యెఱుఁగకుండ మాటలాడెదవా? నోరు సంభాళించుకొనుము. జాగ్రత్త. పో.

మాలి—చిత్తము. భద్రముగాఁ బ్రవర్తింపవలయునని ప్రార్థించుచున్నాను. పోయెదను. సెలవు. (పోఁబోవును.)

పద్మి—ఉండు. ఉండు. పొమ్మనునటికిఁ గుఱ్ఱునఁ బరుగెత్తెదవా? మీ దాసిజాతి కెన్నివిధముల నిచ్చటఁ బోధించుచున్నను నింటికిఁ బోవలయుననియే యెప్పుడు దేవులాట. ఇంటియొద్ద నేము

న్నది. నీమొగము. వాఁకిటిలోఁ గోళ్ళగంప—వంటయింటిలో నజ్జిగూడు— పడకపంచపాళిలో నులకపుక్క—చిలుకకొయ్యానుగుండ. ఇంతేకాదా? పోయెదను సెలవఁట! నీవుపోయిన యెడల నిచ్చట పని యెవరుచేసెద రనుకొంటివి?

మాలి—ఇచ్చట నేను జేయవలసిన పనియంతయు నైనదమ్మా.

పద్మి—పనియైనదా? ఏమైనది, నీమొగము. అతఁ డిక్కడకు వచ్చునుగదా! ఏకుర్చి వేయవలయునో, ఎక్కడ వేయవలయునో ఏలాగున వేయవలయునో, ఏపళ్ళెరములోఁ బువ్వులుంచవలయునో, ఏపళ్ళెరములోఁ దాంబూల ముంపవలయునో, ఏదియెక్కడ నుంచవలయునో, ఏదియెక్కడ నుండఁగూడదో, ఏదియుండి యుండనట్లుండవలయునో, ఏదియుండకుండ నుండినట్లుండవలయునో—

మాలి—అమ్మా! మీమాట కడ్డువచ్చితినని కోపపడకుము. ఇంత గొడవ, యింతగందరగోళము, నింత కాళ్లు త్రొక్కికొనుట యెందులకమ్మా! అతఁడు మీసామంతరాజు బంధువే కాదా?

(నేపథ్యమున) అమ్మా! విజయనారాయణవర్మగారు దయచేసినారు.)

పద్మి—చూచితివా! నీమూలమున నెంతపనిజరిగినదో! వట్టికంత కోపముతోఁ గాలక్షేపమైనది. ఏప్రయత్నమును జేయలేదు. ఎక్కడిదక్కడే. చూడు! ఆ యద్దమిటు తెమ్మా. (అద్దమును జూచుకొని) సరే చూడు. ఈవైపు ముంగురులు కొంచెము ముందునకు వ్రాలినవి. సరిచేయుము- ఛీ! ఆవైపునఁగాదు. ఈవైపున. నీవు వట్టిపెద్దమ్మవు. నేనే సరిచేసికొందును తెమ్మా. నీవు పరుగునఁబోయి యాతని నిటకుఁ దీసికొనిరమ్మా. (దాసినిష్క్రమించును.) నా కాతఁడు విధేయకోటిలోనివాఁడు. నేను మహారాజ్ఞిని. అతఁడు వచ్చినప్పుడు నేను లేవవలయు

నా ? అక్కఱలేదు. ప్రమాదవశమున లేచదనేమో? కట్టు దిట్టముగఁ గూరుచుండెదను.

[నారాయణవర్మ ప్రవేశించును.]

పద్మి—(అదటిపడి లేచును.)

నారా—(ఆమెనుజూచి యదటిపడి మోమోరఁజేసికొని) మహారాజ్ఞీ మణీ ! మీవిధేయవర్గములోని నన్నింత పెద్దసేయవచ్చునా? మీరు నిలువఁబడితిరేల ?

పద్మి—(తోటుప్రాటుతోఁ జప్పునఁగూరుచుండి) (తనలో) ఆహా ! నేను నిలువఁబడితినా ? తెప్పపాటు క్రిందనే కాఁబోలు బింకముగఁ గూరుచుంటినే. ఇప్పుడెట్లు నిలువఁబడియుంటిని? ఎఱుఁగనీకుండ మనస్సు మనచే నెన్నిపనులు చేయించుచున్నది. మనస్సులో నెన్నిదొంగయిలున్నవో? (ప్రకాశముగా) నీవు రాజ్ఞీదర్శనమువలనఁ గలిగిన సంకోచమును విడిచి నిస్సందేహముగా నటఁ గూరుచుండుము.

నారా—అనుగ్రహింపఁబడితిని.

పద్మి—నారాయణవర్మా ! క్షత్రియకాంత పరపురుషునెదుటఁ గానఁబడఁగూడదను మర్యాద నెఱుఁగనిదానను గాను. చక్రవర్తినినైన నేనట్లు తలుపుచాటునఁ గూరుచుండునెడల నాకెట్లుజరుగుఁబాటగును ? నీవంటి తగుమనుష్యుఁడు దర్శనార్థియై వచ్చినప్పుడు నేను గోడచాటునఁ గూరుచుండునెడల నిన్నుఁజులకనచేసినట్లు నీకుఁ దోఁచునేమో ? మీరందఱు నావలన గౌరవింపఁబడినప్పుడేకదా నాకు గౌరవము. అవిలంఘ్యమైన రాజధర్మమునకుఁ గట్టుపడి నేను నీకుఁ బ్రత్యక్షముగఁ గనబడినందులకు క్షమింపుము.

నారా—ఎంత మాట? క్షమింపుమని మీరు నన్నుఁ గోరుట ధర్మమా? మీతండ్రిగారు మా మేనమామగారి సామంతరాజ్యముపై మిగుల నభిమానముతో నుండెడివారు. మీతండ్రిగారు స్వర్గస్థులైనపిమ్మట మా మేనమామ యీయవలసిన కప్పములో సగము కొట్టివైచి మాయెడల మఱింతయభిమానముతో నున్నందులకు మహానంద మొందుచున్నాము. మీరు భగవంతుఁడు— (చేతులు జోడించుకొనును.)

పద్మి—వలదు. వలదు. వ్యవహారపుముచ్చట లిచ్చట నెందులకయ్యా? ఇది యంతఃపురముకాని మహారాజసభ కాదు. పాలనాతంత్రములు, పాఠికములు, కట్టుబడులు, కప్పములు నిచ్చుట యుగ్మములు కావు నారాయణవర్మా! నీవు మహాధీమంతుఁడవని మహావిద్వాంసుఁడవనియు, ధర్మప్రవర్తనతత్పరుఁడవనియు ఊఁ. మహా ఊఁ. ఊఁ. సుందరస్వరూపుఁడవనియు, ననేకుల వలన విని యానందమొందితిని. మాతండ్రిగారి సభలో నిన్నొకసారి చూచి శిరఃకంపన మొనర్చితిని. అట్లులికిపడెద వేల? నే నోరులను స్తోత్రముఁ జేయుదాననుగాను. నామనస్సునకు నచ్చుటచేతనే నే నిట్లు చెప్పుచుంటిని. నీవంటివారు దేశమున కలంకారములు. మధురమధురమైన సపోటాపండు పై కసహ్యముగనుండును. బాగరుపండువలెనుండు నిమ్మపండు నకుఁ జెప్పరాని పులుసుండును. మొసలితలలో మాణిక్యముండును. గాజులోఁ బురుగుండును. మయూరపుఁగూఁత రోఁత. కోకిలరుత మమృతము. అంతర్బహిస్స్వరూపములందు సృష్టిలో నెంతయో వ్యత్యాసము కనఁబడుచున్నది. విజ్ఞానవంతుఁడు వికృతరూపుఁడుగా నుండును. అటికయంతతలతోనో, బోదురుకప్పయంత ముక్కుతోనో, కాకికన్నుతోనో,

గాంచిన వాలకముతోనో తలఁచుచుగా నుందును. ముఖకాంతిచేతఁ జంద్రోదయ మొనర్చు లావణ్యవంతునకుఁ దలలో నున్న, హృదయములోఁ బన్ను తలఁచుచుగా నుండును. కత్తికిఁ దగిన యొర, యొరకుఁ దగిన కత్తి తలఁచుచుగా లభింపవు. అందుచే నిన్ను సావధానముగఁ జూడఁగోరి యిటకు రప్పించితిని. (తనలో) హా! జగన్మోహనుఁ డగు నీకనిఁ జెట్టఁబట్టకుండు నెడల నా జన్మమేల? నాయైశ్వర్యమేల? (ప్రకాశముగా) నారాయణ వర్మా! ఏదియో యోజించుచు నూరకుంటివేల?

నారా—ఏమియు లేదు

పద్మి—ఏమియు లేదనుట సరికాదు. ఏదియో యున్నది. దానిఁ జెప్పుటకు నీ నాలుక సందేహపడుచున్నది కాని నీకన్నులు దానిని వెల్లడిచేయుచున్నవి. మనోరహస్యమును బైటఁబెట్టుటలోఁ గన్నంత చలపాదివస్తువు లేదుసుమా? కన్ను వెలిబుచ్చలేని శరీరవ్యాధియు లేదు. మనోవ్యాపారమును లేదు. గొంతుకోయఁదలఁచిన యుద్రేకము మొదలు, మద్దిపుకొను నుబలాటమువఱకు నన్ని మానసికావస్థలను గూడ మొలచినది మొలచినట్లు కన్ను చిత్రింపఁగలదు. కంటికొనలో నున్న గ్రంథభండారమింతింతయా? ఇప్పుడు నీకంటిచూపునుబట్టి నీమనస్సున నేమి యోజించుకొనుచుంటివో నేను జెప్పఁగలను. చెప్పనా?

నారా—చెప్పదలఁచినవారు మానుదురా?

పద్మి—తలఁచుకొన్న పని మానుట నాయొద్ద లేదే కొత్తవాఁడవైన నాతో నీమె యింత నిస్సందేహముగ నింత చనవుగ నేల మాటలాడుచున్నదో. ఈమెయంతరంగవైఖరి యెట్టిదోసుమా యని నీవు గుబ్బెటలు పడుచున్నావు. అదిగో మునిసిమునిసినవ్వు

నవ్వుచున్నావు. నేను జెప్పినది సత్యమేకద. నీతో నే నింత చనువుగ నేలమాటలాడుచున్నానో చెప్పెదను వినుము. మా తండ్రిగారు స్వర్గస్థులై దాదాపుగా నాలుమాసములు కావచ్చినది. ఈమహారాజ్యభారమంతయు నాతలఁగట్టి యామహానుభావుఁడు మహాదేవసన్నిధానమును జేరినాఁడు. పసిననిన్నిదేండ్ల బాలను. అయినను జంకుకొంకు నెఱుఁగనిదాననుగాని వ్యవహారసమర్థనము కష్టముగానున్నది. మంత్రులు లేరా! సేనాధిపతులు లేరా యని యందువేమో? ఉన్నారు. వారు నామాటకు బళీ యనువారేకాని నాకుఁ జెప్పఁదగినవారు కారు. కఠినమైనహితమును నాకు బోధించునెడల నాకెక్కడఁగోపము వచ్చునో, తమలబ్ధి యెక్కడఁజెడునో యని దేవులాడు మంత్రికాని సేనానికాని నాకుండిననేమి లేకున్ననేమి రాష్ట్రలాభముకంటె స్వలాభమును జూచుకొనువాఁడు రాష్ట్రమున కుంకట మహాకష్టదమును కాని మఱియొకటి కాదు. పాపము! వారి ననవలసినపని యేమున్నది? ధనసంపాదనకై సేవకొల్వుకొన్నపిమ్మట నెవ్వఁడైన నొక్కటే. నీవు బుద్ధిశాలివనియు, మారాష్ట్రముపై నవ్యాజాభిమానముఁ గలవాడవనియు నే నెఱిఁగియుండుటచే నిన్నిక్కడకు రమ్మంటిని. అదిగో మొగము ముడుచుకొనుచున్నావు. నిన్ను సేవకై నియోజించెద ననుకొనుచున్నావు కాఁబోలు. నీవు నాకు హితబోధముకై నాయొద్దనుండవలయును. నీయభిప్రాయము లేకుండ నే నేపనియుఁ జేయను. నీవు నాతో సమానప్రతిపత్తికలవాఁడవై యిచ్చట నుండుము. నాచే నీరాష్ట్రమును నీయిష్టానుసారముగఁ బరిపాలింపఁజేయుము.

నారా—చక్రవర్తినీ! మీరు నాతో నింతధారాళముగ మాటలాడుచున్నప్పుడు నే నట్లు మాటలాడకుండుట నాదితప్పు. మీరు నాకీయఁదలఁచిన గౌరవాధికతకు నేను సర్వదా కృతజ్ఞుఁడను గాని—

పద్మి—ఆగు. నారాయణవర్మా! అంతటితో నాఁగు. ఇఁకఁ గాని యేల? ఈరాష్ట్రమంతయు నీవే పరిపాలించుకొనుచుండవచ్చునే. నేను నిమిత్తమాత్రముగనుందును. నీయుత్సాహమును, సమంజసతను జూచి నేనిందులకుఁ బ్రార్థించుచున్నాను. మాతండ్రిగారు నాకొసఁగినరాజ్యము ననుదర్భముగఁ బరిపాలించిన నింద నాకు రాకుండ నన్నుఁ గనిపట్టుము. అంతయే నా కోరిక.

నారా—మీతండ్రిగారిరాజ్యమును యథాన్యాయ్యముగఁ బరిపాలించుట మీకెట్లుసమీచీనమో మీతండ్రిగారు మిమ్ముఁ గళింగరాజపుత్రుని వివాహమాడుమని యిచ్చిన యాజ్ఞను బరిపాలించుట మీకంతసమీచీనమే. కావున మీ రాతనిఁ ద్వరలోఁ బెండ్లియాడి యాతనిఁ దెచ్చి యిటబెట్టుకొనుఁడు. ఆతఁడే మీకు సర్వహితముల బోధించును. మఱియొక్కఁడేల?

పద్మి—ఏమంటివి? నేను నిన్నడిగినదేమి? నీవు చెప్పినదేమి? నీవిచ్చటనిల్చి నారాజ్యపాలనతంత్రమున సాహాయ్యమును జేయుమని నిన్ను నేను గోరుటయేమి? కళింగరాజపుత్రుని వివాహమాడుమని నీవు నాకు బోధించుటయేమి? దానికి దీని కేమైన సంబంధమున్నదా? నీసాహాయ్యమునకు నామనువునకును లంకె వైచితివేమి? ఇది విరుద్ధముగ లేదా? ఎక్కడిమహీపాలనము. ఎక్కడిమనువు? నారాజ్యములో నిప్రజలు పంటలులేక

పోవుటచే నింగిలీలంఘనములతో నుండ నేను పెండ్లియందుఁ లాలసింతునా? నేను స్త్రీనని నా హితులు నాయాజ్ఞలను వ్యతిరేకించుచుండ మగనిని వశపఱచుకొని తూఁగుటుయ్యెలలోఁ ద్రుళ్ళుచునుమని నీయభిప్రాయమా? రాచపుట్టువునకు రాజ్యపాలనము విధి కాని వివాహమంతవిధి కాదే. మనకుఁ గావలసినది జనసౌఖ్యమా? స్వసౌఖ్యమా? రాజులు ప్రపంచసౌఖ్యమునకు సృష్టింపఁబడిరి కాని లోఁడి తెడుకుటుంబములో గుడుగుడుగుంచములాడుటకా? నారాయణవర్మా! స్వార్థపరిత్యాగమొనర్చి పరహితాభిలాషచే రాజ్యతంత్ర మొనర్పు నేను రవంతతో దుపదుమని నిన్ను వాంఛింపఁగఁ గళింగరాజపుత్రుని పెండ్లి చేసికొనుమని నీవు నాకు బోధించితివి. నేను గోరినకోరిక నీకిష్టమగు నెడల సరే యనవలయును. కాదేని నా కవకాశము లేదనవలయును. అంతేకాని సంబంధశూన్యమైన యీ యుపదేశము నాకుఁ జేయఁదగునా? నే నెవరినైనఁ బెండ్లిచేసికొందునో లేదో నీవెఱుంగుదువా?

నారా.—(తనలో) ఈమె నన్ను వరించుచున్నదని దుర్భ్రమ మొందితిని. ఈమెప్రకృతి దురవగాహముగనున్నది. (ప్రకా) చక్రవర్తినీ! నాహితబోధనము సదా విని యట్లు ప్రవర్తించుటకై నన్ను మీరాజ్యమున నుండుమంటిరి. నే నిప్పుడు చేసిన స్వల్పమైనహితబోధనమును మీకు వినుటకే కష్టమయ్యెనే?

గీ. హితము బోధింపు మసికోర । హితము చెప్పు
మంత్రిమాటగణింపఁడు । తొన్మధవుండు
ఛాత్రు డాచార్యుమాటను । నరకుఁగొనఁడు
మఱి పురోహితుమాట నెవ్వరును వినరు

ఎల్లవారును హితబోద్ధ । లెల్లవారు
హితతిరస్కారపారీణ । మతులు, హితము
చెప్పమనఁ గోరువారికి । సిగ్గులేదు
చెప్పువారి కంతటికంటె । సిగ్గులేదు.

పద్మి—ఎంతమాటనంటివి. ఎంతమాటనంటివి. ఎంతయులక్ష్యముగ మాటలాడితివి. చక్రవర్తివినని కానంత యాలోచించితివి కావే! సెబాస్! నీయులక్ష్యమే, నీనిర్భయత్వమే నాకు సంతోష మిచ్చినది సుమా! నీవుకూడ నితరులవలె వంగివంగి, నంగినంగి కల్లబొల్లి స్తుతిపాఠములాడి యుండినయెడల నాకు రోఁతగ నుండియుండును. నీస్వతంత్రబుద్ధిని గనఁబఱచితివి. ఆనందించితిని. నా మాటకందఱు తలలువంచుకొనువారే. అందఱు చేతులు నులుముకొనువారే. అందఱు ఓడలు ముడుచుకొనువారే. ఒక్కఁడైన మచ్చునకైన నెదురు తిరిగినవాఁడు కనఁబడఁడే! దోసిలొగ్గి చిత్తము చిత్తమనువానినిఁ జూచి నాకు రోఁత. తలయెత్తి రవంత మొరాయించినవానినిఁ జూడ నాకు ముచ్చట. ఎంతసేపు వినమ్రత, ఎంతసేపు మెత్తన, ఛీ! నా కసహ్యము. రవంత కఱకుఁదనము, రవంత యెదురెక్కుదనము, రవంత త్రుళ్ళిపాటు ప్రభుత్వమున కప్పుడప్పుడు మోతాదుగఁ దగులుచుండినఁ గాని సుఖమే లేదు. పండ్లున్నవాండ్లకప్పుడు వెన్న దినవలసివచ్చునెడల వాని కది యెంతయసహ్యముగనుండునో యీనంతతవినయప్రవర్తనప్రదర్శనము నాకంతకంటె నసహ్యముగనున్నది. కఱకఱలాడుచుఁ గటుక్కుమన్నది కాని పంటికి సుఖమీయలేదు. మిరెపుఁగాయ చురుకుగాని నాలుకకు ద్రవమీయలేదు. వాదములో రవంత యొత్తిపొడుపున్నఁ గాని ప్రతివాది కుద్రేకము లేదు. ప్రజలతిరుగుఁబాటున్నప్పుడు

కాని ప్రభుని కుత్సాహము లేదు. మొత్తము మీఁద నాతత్త్వ మది. ప్రపంచతత్త్వ మదియగునో కాదో? ఎటులైననేమి? సంపూర్ణ విధేయతాదర్శనమున మొగము మొత్తిన నాకు నీ యవిధేయవాక్యమున నా మొత్తు వదలినది. ఏలాగు! చెప్పుమనికోరువారికి సిగ్గు లేదు. చెప్పువారికిఁ గూడ సిగ్గు లేదు. ఇక్కడకు నాకును నీకును గూడ సిగ్గు లేదని చెప్పితివికదా! ఇంక సంకోచమేల? నీవు కనిలేనిదే నాపెండ్లినిగూర్చి ముచ్చటించితివి. నే నూరకుందునా? నీపెండ్లిమాట యేమని నేనడుగుచున్నాను. నీమేనమామకూఁతుతో నీకు వివాహము స్థిరపడినదా? నారాయణవర్మా! నీమేనమామపుత్రిక యెట్లుండునో నేను జెప్పనా? గుండ్రని మొగము. అవునా? గుండ్రని కన్నులు, ఉంగరాలవెండ్రుకలు, కుడికంటిలోఁ బుట్టుమచ్చ, గడ్డము మీఁదఁ బచ్చబొట్టు. ఎడమచెవి రవంత వంకర, అవునా?

నారా—(నవ్వుచు) చక్రవర్తినీ! మీ కింతస్పష్టముగ నెట్లు తెలిసెను?

పత్ని—దేవేంద్రుని కొడలంతయుఁ గన్నులైనట్లుమా కొడలంతయుఁ జెవులే. అదిగాక యామెయు నేను నిచ్చట బాల్యమునఁ జదువుకొంటిమి కాదా? నీభార్య నాకుఁ గ్రొత్తయనుకొంటివా? పోనీ! ఆసంగతి యెందులకు? నీ వామెను వివాహమాడుట కంగీకరించినట్లు నీమందహాసమే స్పష్టపఱచుచున్నదే? నారాయణవర్మా! తెలిసినవాడవు కదా? ధర్మాధర్మవిచక్షణుఁడవు కదా! మేనమామకూఁతును వివాహముఁ జేసికొనుట తప్పని యెఱుఁగవా? ఏల యంగీకరించితివి?

నారా—అట్టియాచార మచ్చటచ్చట నున్నది కాని లేకపోలేదే!

పత్ని—అచ్చటచ్చట నున్నదా? ఎచ్చటెచ్చట నున్న మన కేమి? మా రాజ్యమందున్నదా? మీ మేనమామ రాజ్యమందున్న

దా ? ఆచారము దేశమునకు సంబంధించినదేకద? మనదేశా చారమును మనమే మీఱవచ్చునా ? ఈదేశమునకు దురా చారమైనది నీకు సదాచార మెట్లు? నీవీదేశములోనివాఁడవు కావా ? ఆచార కాండమందుఁ బ్రత్యేకముగ నీకొఱకు వ్యతి రేకసూత్రము పుట్టియున్నదా ? ఉండు. ఉండు. నేను జెప్పఁద లఁచిన దేదో చెప్పినతరువాత నీవు చెప్పవచ్చును. తొందర యేల ? పండితుఁడవు ప్రత్యుత్తరమే చెప్పలేకుందువా ? కాని నీ పాండిత్యము పరబోధమున కక్కఱకురాదగినదే కాని స్వాచరణమున కక్కఱకురాదేమి ? దురాచారమును మనవం టివారే యవలంబించినయెడల నిఁకేమున్నది. ప్రజలుపాడైపో రా? ప్రజలకు మార్గదర్శకులుగా నుండవలసినవారము కాని సామాన్యులముకామే. వంకరదువ్వెనతో సూటియైన పాకట వచ్చునా ? ప్రజలతో నాకేమిసంబంధమని నీవు తప్పించుకొ నుట కవకాశములేదే ? నీ మేనమామ యపుత్రకుఁడగుటచే నీ వాతనిరాజ్యమును స్వీకరింపవలసినవాఁడవుకావా ? ప్రజ లప్పుడే నీమంచిచెడ్డలను గనిపెట్టుచున్నారని యెఱుఁగవా ? ఉదయవైఖరినిబట్టి దినమెట్లుండునో గొల్లవాఁడైన గ్రహింప లేకుండునా? ప్రభుత్వము లేనప్పుడే యింతనిరంకుశముగఁ బ్ర వర్తించువాఁడవు. ప్రభుత్వమువచ్చినపిమ్మట నెట్లుందువో యని జనులకు సందేహము కలుగనీయవచ్చునా ?

నారా—నాచరిత్రమును మీరు వినవలయును. అతిసంక్షేపముగఁ జె ప్పెదను. నేను తొమ్మిదేండ్లపిల్లవాఁడనై యుండగా మాతల్లి దండ్రులు పరలోకగతులైరి. అవసానకాలమున వారు మా మేనమామతో నిట్లు చెప్పిరి. “మాదురదృష్టవశమున మారాజ్య ముదిపఱకే పోయినది. మా పిల్లవానిని నీవుపెంచి యిప్పటికి

రెండేండ్ల వయస్సున్న నీపిల్లను మాతులకన్యావివాహము మాదేశమున నాచారమే కావున, వానికిచ్చి జీవనాధారమేమైనఁ గల్పించినయెడల మాయాత్మలు సంతోషించును. ” వారి యవసానవాంఛను మా మేనమామ తీర్పఁదలచినాఁడు.

పద్మి—ఈచరిత్రము నేను విననిదనియే నాతోఁ జెప్పితివా ? నీవు చెప్పినమాటలనుబట్టి బాల్యమున నీతల్లిదండ్రుల మృతి, వారు నిన్ను మేనమామ కప్పఁజెప్పుట, అతఁడు నిన్ను బెంచుట, యిల్లరికముండుట తక్క నీకితరాధారమేదియు లేకుండుట యివియే కారణములని తెలియుచున్నది. కాని మీయన్యోన్యానురాగముమాట చెప్పకపోయితివేల ? ఇట్టిసన్నివేశములో నన్యోన్యానురాగ ముండుట కవకాశముండునా ? నీవెఱుఁగనిసంగతి కాదే ! నీయెడల వారికుండునది జాలికాని యనురాగమెంతమాత్రము కాదు. వారియెడల నీకుండునది కృతజ్ఞతకాని ప్రేమకానేరదు. ‘ పాపము. ఇతరాధారములేనివాఁ’డని వారికి నీయందుండును. ఎంతలో పెంచి పెద్దవానినిఁ జేసినారు వారియెడల విశ్వాసముగఁ బ్రవర్తింపకపోవుటవల్ల బాగుగానుండదని నీకు వారియందుండును. ఇట్టి మనస్థితులు వివాహమునకు సాధనములగునా ?

నారా—చక్రవర్తినీ ! ఈయంశము లాలోచించుటయంతయు మీకెందులకు ? నన్ను రమ్మని యెందుల కాజ్ఞాపించితిరో యది సెలవిచ్చి నాకు సెలవీయఁదగును.

పద్మి—ఎందుల కీగొడవయని యెంత తృణప్రాయముగాఁ జెప్పితివి? చక్రవర్తినిపగుటచే నన్నిగొడవలు నాకే కావలయునని నీవెఱుఁగవా ? నాకు సహపాఠిని నాకత్యంతమిత్రమునైన రత్నప్రభను నీవు వివాహమాడఁ దలఁచియున్నావు కదా?

నీవు నాకింక సామంతరాజవు కావలసియున్నావు కదా? ఆమెకు నీ యందనురాగమున్నదో? లేదో? నీ కామె యం దెట్లున్నదో! నేను గనుఁగొని మీవివాహమును స్థిరపఱుపవలయును గాదా! అంతేకాని నీ తల్లిదండ్రుల యవసానవాక్యములు తీర్పఁదలఁచిన నీమేనమామ తొందరచేత మీకు హృదయపరీక్ష లేకుండ గలిపించినవారియెడల గౌరవముకొఱకు దంపతులయి యెడమొగము, పెడమొగమై యిదుములందగ నేను సహింతునా? నన్నెందులకుఁ బిలిపించితిరో త్వరగఁ జెప్పుమని నీవు నన్ను దొందరపెట్టుచుంటివే. నిశ్చలమై, నిరంతరమై, నిర్వ్యాజమైన యనురాగము నాచెల్లెలియందు నీ కున్నదా? నిజము చెప్పుము.

నారా—ఉన్నది.

పద్మి—(తనలో) హా! బాకుపోటు బ్రహ్మరంధ్రము నంటినది. (ప్రకా) ఉన్నదా? నిజముగనున్నదా? చక్రవర్తిని మొగము బాగుగాఁ బరిశీలించి మఱి చెప్పుము.

నారా—చక్రవర్తినీ! దైవముఖమును జూచి చెప్పుచున్నాను. ఉన్నది. ఉన్నది.

పద్మి—(తనలో) హా! ప్రాణమెగిరి పోవుచున్నది. (ప్రకా) కనఁబడని దైవముఖమును నీవు చూచుటయేమి? చెప్పుటయేమి? నాకది పనికిరాదు. ఇదిగో నామొగమును జూచి చెప్పుము. విద్యుద్దీపమువలె వెలిగిపోవుచున్న నామొగమును జూచి చెప్పుము. (తనలో) హా! పెదవు లదరుచున్నవేమో. గుండెలు గొంతులోఁ గొట్టుచున్నవేమో? బింకముగఁ గూరుచుండెదను. (ప్రకా) నారాయణవర్మా! తొందరలేదు. బాగుగా నిదానించి మఱి చెప్పుము.

నారా—(చక్రవర్తినివంకఁ జూచి) త్రికరణశుద్ధిగా మనవిచేయు చున్నాను. మా కన్యోన్యానురాగమున్నది.

పద్మి—(తనలో) హా! భగవంతుఁడా! ఇఁక నాబ్రతు కేల్లు? ఈతఁడు నన్ను బాగుగాఁ జూచినప్పటికి నాయందుఁ గానంతయైన ననురాగము లేకున్నాఁడే. నేను సౌందర్యహీననా? ఈ తఁడు గుడ్డివాఁడా? (ప్ర. కా.) ఏమంటివయ్యా! నేను దిన్నగ వినలేదు.

నారా—చక్రవర్తినీ! మా కన్యోన్యానురాగ మున్నదని మనవిచేసితిని.

పద్మి—(తనలో) హుఁ. (ప్రకా) అన్యోన్యానురాగము మాట యెవ రడిగినారని చెప్పితివయ్యా! నీమాట నేనడుగగ నామెమాట కూడ నీవేచెప్ప నేల? అది నీవు చెప్పఁదగదు. నే నామెను గనుగొనకపోవుదునా?

నారా—మీాయిష్టము.

పద్మి—నీ విఁకఁ బోవచ్చును. రత్నప్రభ నిక్కడకుఁ బంపుమని నీవు మీా మేనమామతోఁ జెప్పుము.

నారా—అభ్యంతరమేమి? సెలవుదీసికొందును. (పోఁబోవుచు.)

పద్మి—ఉండు. ఉండు. రత్నప్రభ నిక్కడ కెవ్వరుతీసికొనివచ్చెదరు?

నారా—ఆమెతండ్రియే తీసికొనివచ్చును.

పద్మి—అతఁడు పెద్దవాఁడు. అతని నెందులకు శ్రమపెట్టవలయును? పోనీ రత్నప్రభ వెంట నీవే రాకూడదా?

నారా—నేనెందులకు ? నేనువచ్చితినిగాదా! నాపరీక్ష యేదో యైనదిగాదా?

పద్మి—నీవు తిరిగి రాఁదలఁచుకొననప్పుడు వెళ్ళుట యెందులకు? ఇక్కడనేయుండుము. ఆమెవచ్చినతరువాత నిద్దఱుపోవచ్చును.

నారా—నన్ను క్షమింపుము వివాహముకాకుండ నామెయు నేనును కలసివచ్చుటకాని, పోవుటకాని బాగుగానుండదు.

పద్మి—నీ కట్టిసందేహమున్న యెడలఁ బొమ్ము.

నారా—చిత్తము. (పోవును.)

పద్మి—ఉస్సు. ఉస్సు. నారాయణవర్మా!

నారా—(ప్రవేశించి) వచ్చుచున్నాను.

పద్మి—నీవు పోకతప్పదా ?

నారా—పనిలేకుండ నేల యుండవలయును ?

పద్మి—పనిలేకుండ నుండుమనుదాననే యనుకొంటివా? నే నెందుల కుండుమంటినో యోజించితివా ?

నారా—నాకుఁ దెలియదు.

పద్మి—రత్నప్రభ నాకు ప్రాణసమానయైనసఖి. ఆమెకు నీయెడల ననురాగమున్నట్లు నాకుఁ దెలిసిన యెడల—వింటివా? అట్లు స్థిరపడిన యెడల—అబ్బ! అబ్బ!

నారా—అదియేమి. అదియేమి?

పద్మి—(తనలో) అయ్యో! వెల్లడిపడితిని గాఁబోలు. (ప్రకా) ఎదను గుండెలో 'కళుకు' మని పొడిచినట్లైనది. చూచితివా దేహములో నెక్కడ నేమిజరుగుచున్నదో యెంతమాత్రము తెలియదు. హృదయముమాట నింకఁ జెప్పవలసిన దేమున్నది? ఈ మాటలకేమి. చూదము. ఊఁ నేనిదివర కెక్కడనుఁ జెప్పితిని?

నారా—ఆమెకు నాయం దనురాగమున్నట్లు స్థిరపడిన యెడల—

పద్మి—హాఁ. ఆమాట యెందులకు. అది అయిపోయినదికదా. మీకు వివాహపూర్వమున జరుగవలసిన ప్రథానోత్సవమును నాకోటలో నేను జేయింతును.

నారా—అనుగ్రహింపఁబడితిని.

పద్మి—అందువలన నిన్నిట నే యుండుమని యంటిని.

నారా—చిత్తము.

పద్మి—రత్నపరీక్షను దీసికొనిరమ్మని యామెతండ్రికి మఱియొకనిచే వార్తనంపెదను.

నారా—చిత్తము. సెలవు.

పద్మి—సరే, (నారాయణవర్మ పోవును.)

ఎవరక్కడ ?

(నేపథ్యమున) అమ్మా! ఏమి సెలవు ?

పద్మి—ఇటురా.

[మాలిని ప్రవేశించును.]

మాలినీ! నారాయణవర్మ వెళ్ళినాఁడా ?

మాలి—ఆ.

పద్మి—అతని మొగమును నీవు పరిశీలనముగఁజూచితివా ?

మాలి—ఏమమ్మా అట్లడుగుచున్నారు ?

పద్మి—తిరుగప్రశ్నించుటేల ? చూచితివా ?

మాలి—చూచితిని.

పద్మి—సంతోషముగానున్నడా ? విచారముగానున్నడా ? ఆలోచన భారమున నున్నదా ? సందేహాక్రాంతమైయున్నదా? సంభ్రమసంకులమై యున్నదా ?

మాలి—అంతసూక్ష్మపుసంగతులు నేను జెప్ప లేనమ్మా

పద్మి—నీ మొగము. నీకుఁగన్ను లెందుకు. నెమలితోఁకకుఁ గన్నులే— నీకుఁగన్నులే. మంచమునకుఁగన్నులే— నీకుఁగన్నులే. ముంజెకాయకుఁ గన్నులే— నీకుఁ గన్నులే. ఎందులకున్నకన్నులు. సూక్ష్మపుసంగతులు చెప్పలేనంటివికదా! పోనిమ్ము. అతఁడు చురుకుగా నడచినాఁడా ? మెల్లఁగనడచినాఁడా ? అటునిటు కాకుండ నడచినాడా ? అడుగు వేసినప్పుడు బింకముగ వేసినాఁడా ? పదులుపదులుగ వేసినాఁడా ?

మాలి—అతనియడుగు నామెడపై వేయకపోవుటవలన నెట్లువేసినాఁడో చెప్పలేనమ్మా!

పద్మి—ఓసి నీగొంతుకఁ గోయ! చమత్కారపుమాట లేవ్చుచుంటి
వా! ఆతనికాలు నీగొంతుకపైఁ బడలేదందువా? ఆలోపముఁ
దీర్చుటకు నేనుంటినిగాదా! పో! ఆవలికిఁ బో! నీవిక్కడ
కింక రానక్కఱలేదు. (మాలిని పోవును.)

నాసేవకుఁ బనుచుదాసిని జేర్చునెడల నది యితరదృష్టిచే నాసేవ
తిన్నగఁ జేయదేమోయని యీయనలిదాసిని జేర్చఁగ నిది
యీతీరుననున్నది. బుద్ధిహీనయేగాని విశ్వాసవతి.

(నేపథ్యమున) అమ్మా! స్నానమునకు దయచేయవచ్చును.

పద్మి—మాలినీ!

మాలి—(ప్రవేశించి) అమ్మా!

పద్మి—ఈయుదయమున నూరిలోని విశేషములేమియు చెప్పలేదేమి?

మాలి—ఇచ్చటివిశేషములలోఁ దెలిపిలేకపోయినది. అమ్మా!
ఒకబైరాగి వచ్చి కోటగుమ్మమునొద్ద నిన్నసాయంకాలము
నుండియుఁ గూరుచుండియున్నాఁడు ఆతఁడు చక్రవర్తినిగారి
దర్శనము నపేక్షించియున్నాఁడు. మీ కామెదర్శనము కాదని
యు, మంత్రిని జూచి మీయభీష్టమేదో చెప్పికొనుఁడనియు
నెందఱో చెప్పినారు ఆమెదర్శనమగువఱకు నేనిక్కడ నభో
జనముగఁ గూరుచుందునని ప్రతిజ్ఞచేసి యట్లుకూరుచుండి
నాఁడు. ఏమిసెలవు?

పద్మి—ఆతనికాపట్టెందులకో? నేనిప్పుడు చూడనొల్లను. మధ్యా
హ్నమునఁ జూతునని చెప్పుము. చూచుట నిశ్చయము కావున
భుజింపుమని నేనుగోరితినని చెప్పుము.

మాలి—చిత్తము. స్నానశాలకు దయచేయుఁడు.

పద్మి—సరే. నీవు మూఁడుగంటలకు నాతోమాటలాడి మఱియాత
నిని దీసికొనిరావలయును.

మాలి—చిత్తము. (ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.

# పద్మిని

## ద్వితీయాంకము.



ప్రదేశము—అంతఃపురము.

[ప్రవేశము—మాలిని, పద్మిని]

మా—మట్టగిడసలాగున నున్నాఁడమ్మా- పడుచువాఁడు.

ప—అటులైన విరాగియెట్లయ్యెను? అతఁడు దొంగబైరాగియేమో సుమా?

మా—నిజమైన బైరాగియైనయెడల మీకు లాభమేమి? దొంగవాఁడైనయెడల నష్టియేమి? ఏవఁడో యొకఁడు; మీకు రాణిగారు దర్శన మిప్పించెదరు, భుజింపవయ్యా యని యతని బతిమాలితిని. అంగీకరింపలేదు.

ప—నాకీపాపముగూడ నెందులకు? త్వరగఁ దీసికొనిరమ్మా. మూఁడునిముసములకంటె నేనెక్కువ యవకాశ మాతని కీయఁజాలను. ఆసంగతి యాతనితోఁ జెప్పి మఱి తీసికొనిరమ్మా.

మా—అమ్మా! వెళ్ళనా?

ప—మాలినీ! వెళ్లుదువు గానిలే. చూడు. ఈదినమున నేమో కాని మనస్సు మనస్సులో లేదుసుమా?

మా—ఔనమ్మా. అడిగినయెడలఁ దిట్టుదురేమో యని యూరకుంటిని గాని నేను గనిపట్టకపోలేదు. కోడిమాంసము సెనగపప్పు చేసిన యిగురు మీకెంతయో యిష్టముకదా యని చేయించితిని. వేలితో ముట్టుకొననైన ముట్టుకొనక పోతిరి.

ప—నామాటకేమి? మన యతిథిసుఖము ముందుగా మనము చూడఁ దగినది. విజయనారాయణవర్మ సుష్టుగా భుజియించినాఁడో లేదో కనుగొంటివా?

మా—ఆతని కేమమ్మా మన్నపుగోరవంక మిరెపుబొడ్లను మ్రింగి నట్లాఁతఁడొక్కటే మ్రింగుట కాని నములనైన లేదఁటమ్మా.

ప—హుఁ (దీర్ఘనిశ్వాసముతో) నాతో నిచ్చట్ల జిన్నతనమునఁ జదువుకొన్న రత్నప్రభ నీకు జ్ఞప్తిలో నున్నదా?

మా—లేకేమమ్మా! ఆమె మీవయస్సుదే కాదా? కంటిలోఁ గుదపలాగునఁ బుట్టుమచ్చయున్నపిల్లయే కాదఁటమ్మా?

ప—ఆమె నాకంటె రెండేండ్లు చిన్న. కంటిలోఁ బుట్టుమచ్చమాటయే చెప్పితివి, కాని చెవికున్న వంకరమాట చెప్పితివి కావేమి?

మా—అమ్మా! పెద్దవారిలోపములు మేము చెప్పఁగూడదు. కంటిలోఁ బుట్టుమచ్చ యదృష్టచిహ్నము కావునఁ జెప్పితిని.

ప—సరి. దీని కేమి? ఆమె చక్కనిదనియే నీ యభిప్రాయము కాదా?

మా—ఆసంగతి నాకెట్లు తెలియునమ్మా?

ప—తెలియక పోవుటయేమి నీమొగము?

మా—ఆఁడుదాని చక్కఁదనము గ్రహించుశక్తి యంతో యింతో మగవానికున్నది కాని యాఁడుదానికి లేదు. ఒక యాఁడుది మఱియొక యాఁడుదానిని జూచునప్పుడు మొట్టమొదటఁ బరీక్షించున దేదనఁగా! గాగరా యేడు పీటీలదో తొమ్మిది పీటీలదో- తొడుగుకొన్న ప్రైకది పాలపిట్టరంగో భరతపక్షిరంగో- పెట్టుకొన్న జాకాలలో నిముత్యములు గట్టివో గుల్లవో యింతే- ఈప్రథమ పరీక్షయైన తరువాత, రెండవపరీక్ష యేదో చెప్పనా? నుదురురవంత యెత్తు. పెదవి కాసంత బెట్ట. గడ్డముకొక నూలుపాసి పొడుగు. ఎడమచేతికి పుప్పిగోరు. ఇది

రెండవపరీక్ష. ఇంతటితోఁ బరీక్షకు భరతవాక్యము. అంతే కాని యాఁడుదాని యవయవముల చక్కఁదనము మఱియొక యాఁడుది గ్రహింపదు. గ్రహింపలేదు కూడను. మొత్తము మీఁద వాఁడుదాని సౌందర్య మాఁడుదానికి నచ్చదు. ఎవరిమట్టునకు వారే యనుసరనలని వారి నమ్మకము. బుద్ధిగ్రహణ విషయమునఁ గవులలోఁ గూడ నిట్టి తెగులే యున్నదఁట. కాని నా కాసంగతి మట్టునకుఁ దెలియదు.

ప — అట్లైన నా సౌందర్యము నీకు నచ్చలేదన్న మాటయేనా ?

మా — అబ్బే. బజారుమాట చెప్పినాను గాని కోటమాట చెప్పినానా? అమ్మా! మీ సౌందర్యము నాకు నచ్చకపోవుట కూడనా ? ఎంతమాట ?

ప — చూడు-రత్నప్రభది గుండ్రముగమని జ్ఞప్తియున్నదా ?

మా — ఆ- గుండ్రమొగమే.

ప — మగవానికి గుండ్రమొగ మిష్టమా ? కోలమొగ మిష్టమా ?

మా — మగవాఁ డనుచునొక్కఁ డెవ్వఁడైననున్నాఁడా అమ్మా! ఎంత మందిముండకొడుకులు గలసి మగజాతియైనదో- మొత్తముమీఁదఁ జెప్పుటట్టవంటి మొగముగలవాని కుప్పకాయవంటి మొగముగలయాఁడుదిష్టము. పందిటిదోసకాయవంటి మొగముగల యాఁడుదాని కత్తుకపాత్రమువంటి మొగమున్న మగవానిపై నిష్టము. ఇది దేశాచారముగా జరుగుచున్న పద్ధతి. కాని మఱియొకటి కాదమ్మా! ఇందులోను డెటుకులు తిరకాసు లెన్నో యుండవచ్చును. కొందఱు మగముండకొడుకుల కవసరమే సౌందర్యము కాని యింతకంటె లేనే లేదమ్మా! ఈమాటల కేమి కాని బైరాగిమాట నేమి చెప్పినారు?

ప—సరే. తీసికొనిరమ్ము. మూఁడునిముసములకంటె నే నెక్కువ సేపు కూరుచుండనని చెప్పుము.

(మాలిని నిష్క్రమించును.)

సౌందర్యరసగ్రహణమున మాలిని చెప్పినమాటలు కొంత సత్యముగను కొంత యసత్యముగను గానిపించుచున్నవి. విజయనారాయణవర్మది కోలమొగము కావునసే రత్నప్రభ గుండ్రమొగ మాతని కంటెయిష్టమైనది అంతవఱకు సత్యమే కాని కోలమొగముగల నేను విజయనారాయణవర్మ నంతగాఢముగా వలచుట యేలసిద్ధించెను? ఇచ్చట నాపరిపాటి యసత్యముగఁ గానఁబడుచున్నది. ఈవలపు నా కెందులకుఁ గలుగవలయునో, దీనివలన నేమికూడఁదలఁచియున్నదో యేమియుఁ దెలియదు. నాతండ్రి నాకు నియమించినభర్త నిదివఱకుఁ జూడనైనలేదు. ఏమో ఒక్కసారి కాఁబోలును మాతండ్రి సభలో మంచపుఁ గన్నులతో నేమిచూచితినో యెవరిని జూచితినో జ్ఞప్తియెంత మాత్రమును లేదు.

[నేపథ్యమున] సాధువర్యా! ఇటు. ఇటు.

బైరాగిని దీసికొని మాలినివచ్చుచున్నది. నిలువఁబడియే యట్టి మహనీయుని గౌరవించుట మంచిది. (నిలువఁబడును.)

[మురళీమనోహరుఁడు మాలినితోఁ బ్రవేశము.]

విరాగివతంసమా! నమస్కారము.

ము—(తనలో నదరిపడి యట్లె శాంతించి)

గీ. భగ్గుమనువెల్లు హృదినుండి । బ్రహ్మరంధ్ర
మంటి వెన్నముద్దలకోటు । లంబరమునఁ
జెవ్వలగో, తారకలుగఁగఁ । జిమ్మవైచి
నట్లు లోకరెప్పపాట్లలో । నమ్మొ నహహ!

వ—విరాగివతంసమా! నమస్కరించితిని. ఉపవాసమునఁగాఁబోలు నాలుకయెండఁగ మాటలాడలేకుండయున్నారు. నీరసతచేఁ దూలుచున్నారు. మాలినీ! నీవుపోయి పరిమళభరితమైన చల్లని నీరు తెమ్ము.

ము—నారాయణ- వలదు. నారాయణ- వలదు.

వ—(తనలో) నేను నారాయణవర్మను వివాహముచేసికొన నిశ్చయించికొని యుండ నారాయణ వలదు నారాయణ వలదని యీతఁ డపశకునముగ నాశీర్వదించె నేమి? (ప్రకాశముగ) మీరట్లు దయచేయుఁడు.

ము—(తనలో)

గీ. పెండ్లికూఁతును జూడఁగఁ । బెండ్లికొడుకు
వజ్రహారాలతొడుగుతో । వచ్చుఁగాని
బిచ్చగానిరూపంబున । వచ్చునొక్క
మగువఁగను నాన నన్నిట్లు । మార్చివైచె.

గీ. తనువుబంగారుచాయయుఁ । గనులనైల్య
మధరశోణిమ గాఁగ రా । యాకుపచ్చ
మణులజిలజిలతలకట్టు । మబ్బువందు
వేయియింద్రచాపము లుద్భవింపఁ జేసె.

గీ. కపటసన్న్యాసినైనను । గావలసిన
యట్టియమఃస్కృతాసిద్ధి । యంతలోన
నయ్యె నాదుజన్మంబు కృతార్థమయ్యెఁ
జూడరానట్టివెగ్గలు నే । చూచినాఁడ.

వ—అయ్యా! ఒకపావుగడియసేపు శ్రమతీర్చుకొనుఁడు. పిమ్మట నే మాటలాడవచ్చును. మాలినీ! నీవు వీవనతో నాయనకు విసరుము. (మాలినిపోవును.)

ము—(తనలో) సన్యాసివేషమునన్నుఁగాని నన్నీమెచూడదని నేనిట్లు సన్యాసివేషము వేయవలసివచ్చినది స్వార్థమునకై వేషధారణము తఱచుగఁ బ్రకృతిలో జరుగుచున్నదే కాని యొక్క నా తలనే పుట్టినదా?

గీ విటునిసర్వస్వము గ్రహింప । వెలవెలంది
స్వచ్ఛకులసతీపాత్రంబు । నభినయించు
విభునిభూషలు హరియించు । వేడ్క ద్రోహి
భక్తివిశ్వాసగీతము । లాపుచుండు.

జనులధనము గొల్లగదోఁచుఁ । గొనగ దొంగ
పరమదేశభక్తుని రంగు । బ్రామికొనును
ముద్దరాండ్రను గాఁగిటఁ । బూనువబాజుఁగు
కల్లజడలనుదాల్చి భాగవతమాడు.

తరుణికొఱకేను కోటి లా । తాముపూని
కపటయతినాము తెరదాఁటి । కథలువినుతు
తనుమనసులంచు మాయబొం । కలనుగప్పి
గజ్జెకట్టుట, జననైజ । గతియెపతము.

ధనమొ, కీర్తియొ కాష్ఠ్రిమో । వనజముఖియొ
యేదొ మరియేదొ జనుఁడు కాం । క్షించుచుండఁ
దీరదాదుకై మాయసిం । గారములను
దాల్చి తెఱతెక్కలాడుట । తప్పదెపుడు.

పంక్తిబాహ్యులు నటులని । పరిజలుతలఁతు
రిలను నటకుఁడుగాని వాఁ । డెవఁడుగలఁడు
జగతియే నాటకము సర్వ । జనులు నటకు
లవసరముబట్టి యాడుదు । రాటలన్ని.

[మాలిని వీవనతోఁ బ్రవేశించును.]

ము—రాజ్ఞీమణీ! మీదాసి నాకు విసరనక్కఱలేదు. నేను సుఖముగ నున్నాను. మీయాదరమునకు మిగుల సంతసించితిని. నే నిటకువచ్చినకారణమేదో సంక్షేపముగఁ జెప్పెదను. వారాణసిలో గంగాతీరమున నొకమఠము బైరాగులకొఱకుఁ గట్టించుటకు సంకల్పించుకొనియున్నాను. విశేషధనసాధ్యమైనపని యగుటచేతఁ జక్రవర్తినియొద్దకు వచ్చితిని. వలదనుచుండగా నింకవిసరెదవేల?

వ—మాలినీ! నీవు పో.

(మాలిని నిష్క్రమించును.)

అయ్యా! కాశీక్షేత్రమున నిదివఱకనేకమఠము లున్నవి కాఁబోలు నేమి?

ము—ఎన్నియున్నను బైరాగు లిఱకటపుబాధ నొందుచున్నారు

వ—బైరాగులసంఖ్య వృద్ధియగుచున్నదా యేమి?

ము—అగుచుండుటలేదా?

గీ దేహసౌఖ్యమే పరమార్థ మనిగణించు
జాతిగల దేశమందుఁ జార్వాకులు తొత్తు
లన్యతవాదులు తుచ్ఛశాస్త్రార్థవిదులు
కర్మశాలలు నభివృద్ధిఁ గాంచురీతి.
భవవిముక్తియే యపవర్గ మని గణించు
మనదు భరతఖండంబున దినదినంబు
భక్తవరులు బైరాగులు పరమదాత
లన్నశాలలు దేవాలయములు మించు.

వ—వీరందఱు నిజముగా బైరాగు లనియే మీయభిప్రాయమా?

ము—వారు కాకపోవుట వారిది తప్పు. కాదని యనుకొనుట మనది తప్పు.

ప—ఈమాత్రపుఁ దప్పునకేమి? ఇతరులమాట యటుండుఁడు. మీ మాటయే యడుగుచున్నాను. యథార్థవిరాగత మీకుదయించుటచేతనే యిట్లయితిరా?

ము—(తనలో)

గీ. వేసినది దొంగవేసమై । వెలయుచుండఁ
గొంక కేవంక కూఁతనో । కూయవలయు
పూసినది హరితాళంపుఁ । బూఁతగాఁగ
బెదఱ కేకుంకుమంతనో । వేయవలయు.

(ప్రకాశముగా) యథార్థమైన వైరాగ్యమునొందియే నేనిట్లయితిని.

ప—హేహేహే! పడుచువాఁడవు—ఆదిత్యతేజము గలవాఁడవు—ప్రభుకుటుంబములోనివాఁడవలెఁ గానఁబడుచున్నావు. నీకు ప్రపంచవైముఖ్యమెట్లు కలిగినదయ్యా!

ము—చక్రవర్తినీ! మనుజుని ప్రాయము కాని, తేజము కాని జన్మాధికత కాని, వైరాగ్యప్రవృత్తి కెన్నఁడైనఁ బ్రతిబంధకములగునా? ప్రపంచము రోఁతపుట్టుటకేదో మహాకారణమావశ్యకమని యనుకొనుచున్నారా! కాదు. స్వల్పకారణ మందులకుఁ జాలును. కన్ను తిన్నఁగాఁ దెఱచిచూచినయెడలఁ గనఁబడునదంతయు రోఁత కాని మరియొకటియా? బాగుబాగని మనము కొనియాడు వస్తువున్నదే-దానిని దిన్నఁగాఁ బరీక్షింపక మన మట్లు కొనుచున్నాము. కాని దాని చాటున నేమున్నదో చూచినయెడల నీకిఁక భవమందు వాంఛయుండునా? తెల్లవాఱినది మొదలు చూచినవస్తువులనే చూచి, యాడినమాటలనే యాడి, చేసినపనులనే చేసి, తలఁచినతలఁపులే తలఁచి, గిఱగిఱరంకులరాట్న

ములోఁ దిరుగుటకంటె విసుఁగు మరియొకటి యుండునా? ఈ విసుఁగువలనఁ గొందఱు సన్యసింతురు. కాక మరియొక్క సంగతి.

ప—ఇఁక నేసంగతియు నక్కఱలేదు. ఇట్టికాన శాస్త్రప్రవృత్తులు సన్యసించినంతమాత్రమున బహిరంగవస్తువులంలోనిగోఁచ తగ్గినదా? దినచర్యలోని పునరావృత్తిదోషము తగ్గినదా? ఈరెంటింటో వారిమ్ట్రునకైన నేది తగ్గినది? ఇఁక సన్యసించుటెందులకు? మదుమనన్యాసము శిక్షించుటకొక చట్టముండు నెడల మీ రిట్లయి యుందురా? మీ రేరాజ్యమునందివారో కాన్పిన నరిపోయెను గాని మీరు మారాజ్యములోనివా రేమైనయెడల మీరు సన్యసించుటకు నే సంగీకరించియుందునా? జరిగినదేదో జరిగినది. అదింత యిప్పుడక్కఱలేదు. కాని మీ రేయే విద్యలనభ్యసించినారు?

మ—విద్యలేవియు విశేషముగ నభ్యసించి యుండలేదు. ఒక్క జ్యోతిషమునందు మాత్రము కొంతప్రవేశము కలుగఁ జేసికొంటిని?

ప—ఆలాగా? మీరు మంచిసమయమునకే వచ్చితిరి. మాకోటలోఁ ద్వరలో నొకవివాహప్రధానముహూర్తము పెట్టవలసి యున్నది. పెట్టుదురా?

మ—ప్రధానమా? వివాహము జరుగుటకేమి కాని, మీకు బహు మనస్తాపము, బంధువిరోధము కలుగుటకు సిద్ధముగనున్నవి

ప—(తనలో) ఇంతవఱకు సరిగనే చెప్పినాడు. మనస్తాప మారంభమే యైనది. అది వృద్ధియగును గాఁబోలు. బంధువిరోధమును నేను గణింపను. ఏమువచ్చినను సరియే. (ప్రకాశముగా) అయ్యా! ఈసంగతి మీ రెట్లు చెప్పఁగలిగితిరి?

ము—గ్రహబలాబలములచేత—(తనలో) మొదటినుండియు నాకత్తు మవలంబించి పనిచేయుచున్న మాలినికీసారి విశేషధనమిచ్చి యున్నిసంగతులు తెలిసికొనుటవలన నాజ్యోతిషజ్ఞానమున కింత కాంతివచ్చినది.

ప—ఇంక నన్నుఁగూర్చి యేమైనఁ జెప్పఁగలరా? నాజన్మనక్షత్రము—

ము—అది నాకక్కఱలేదు. ముఖమునుజూచియే చెప్పఁగలను. (విదానించి) మీ యొక్క రాజపుత్త్రుఁ డసాధారణముగా వలచియున్నాఁడు.

ప—అది యెందులకు? అది యెందులకు? ఆసంగతి యాతనిగూర్చినది కాని నన్నుఁగూర్చినది కాదే? ఆతఁడు నన్నువలచెనా? అందులో నసాధారణముగనా? నన్నుఁ బ్రేమింపుమని యాతని నేను గోరితినా? చంద్రికళను వలచినయెడల నాతని కెంత ప్రయోజనమో నన్నువలచినయెడలఁగూడ నంతే. ఆతనివలపాతనిలోఁ దెగటాఱవలసినదే. కాని యది యక్కఱకు వచ్చునా? రానిచ్చెదనా? నన్ను వలచినాఁడట అబ్బ! వలచుటకు నేనంత మీఁదమీఁద నున్నాననుకొనెను గాఁబోలు! తాను సామంతరాజనియు నేను జక్రవర్తినినియుఁ దానెఱుఁగఁడా? ఎంతభయభక్తులులేని ప్రవర్తనము!

ము—(తనలో) ఈమాట లిదివఱకు మాలినివలన వినినవే కాదా? ఇప్పుడు తిరిగి నేనేల చింతింపవలయును? ఎప్పటికైన నీమె మనస్సుతిరిగి నన్నంగీకరించునా? నేను సంసారినే యగుదును. కాదేని దొంగసన్యాసమే నిజమైనసన్యాస మగును. (ప్రకాశముగా) మీరు చక్రవర్తిని యగుటచే నెన్నటికైన మిమ్ము సామంతరాజే వివాహమాడవలయును గాని మీతో సమానుఁడగు చక్రవర్తి యిఁక నొకఁడేఁడీ? పరదేశచక్రవర్తులతో

మనకు సంబంధములు లేవయ్యెను. ఆతనివల నసాధారణమైన దని యేల చెప్పితివనఁగ మీ రాతనివరింపకుండు నెడల నాతఁడు ప్రాణపరిత్యాగమైనఁ జేసికొనును. భవపరిత్యాగమైన జేసికొనును.

వ—ఇప్పుడు మీరు చెప్పినమాటలు జ్యోతిషపరిజ్ఞానమువలనఁ జెప్పిన మాటలు కానట్లగపడుచున్నది. నా మొగము చూచి యాతని చావు కాని, సన్యాసము కాని మీ రెట్లు చెప్పఁగలిగితిరయ్యా?

ము—గీ. అర్కుఁడని చంద్రుఁడని శుక్రుఁడని గ్రహంబు
లన్ని వేర్వేఱునామంబు । లంది యున్న
నన్నిరూపంబులను వెల్గు । చున్నయట్టి
తేజ మొక్కటి యౌను గా । దే లతాంగి!
అబ్ధమని సంద్రమని గంగ । యనుచు భిన్న
సంజ్ఞలే కాని యొక్కటే । జలముకాదె
కుండ గుడియను పైభేద । ముండుఁ గాని
యాంతరాకాశ మొక్కటే । యగును గాదె?
ప్రాణులన్నియు బహువిభి । న్నాకృతులను
గర్మభేదంబులను బట్టి । కలిగియున్న
నన్ని ప్రాణులలో నిండి । యున్న యాత్మ
తత్త్వమున నొక్కటే యంచుఁ । దలఁపవలయు.
తనదు నాత్మఁ బరీక్షించు । కొనిన యోగి
యెల్లవారల నాత్మల । నెఱిఁగియుండు
నన్ను నే నెఱుంగుటచేత । నిన్ను వలచు
వాని యాత్మ నెఱింగిన । వాఁడనైతి.

వ—అటులైన నితరులహృదయములన్నియు మీకుఁ బ్రత్యక్షము లేనా?

ము—తెలిసికొనఁ దలఁచిన యెడలఁ గరతలామలకము లేకాని మే మట్లు చేయము.

ప—కాని యిది జ్యోతిష శాస్త్రప్రశ్నయా ?

ము—కాదు మఱియొకటి

ప—ఏదియైన నాకేమి కాని నా హృదయమును బరీక్షించి చెప్పుఁడు.

ము—ఏదో భిక్షకై వచ్చినవాఁడను నేను మీరహస్యములు బైటఁ బెట్టుటేల ?

ప—మీ భయంకరవలనఁ జెడునది కాదు. మీరు సరిగా జెప్పిన యెడల మీ రడుగుకొన్న లాభముకంటె నెక్కువలాభము కలుగును.

ము—(నిదానించి) రాజ్ఞీమణీ! నేను జెప్పఁబోవునది సావధానముగ వినఁ బ్రార్థింతును. మిమ్ము వలచినవానిపై మీకుఁ బ్రేమము లేదు.

ప—ఔను. కళింగరాజపుత్త్రునిపై నాకుఁ బ్రేమము లేదు. ఆసంగతి నే నిదివఱ కనినమాటలవలననే తెలిసికొనఁదగినది. గొప్ప జ్యోస్యమే చెప్పితిరి.

ము—అంతటితోఁ గాలేదు. ఇంకఁ జెప్పుచున్నాను. మీరు మఱియొక రాజపుత్త్రుని గాఢముగా వలచిరి. కాని యాతఁడు మిమ్మపేక్షింపలేదు.

ప—ఆఁ, ఆఁ, నిజముగా నిది హృదయపరీక్షవలనఁ జెప్పినదేనా ? నిజముగా మీరు దైవజ్ఞులు. నేను చాల సంతసించితిని. కాని మీకుఁ జిన్నవయస్సగుటచేతఁ గొంత యనాలోచితముగఁ జెప్పితారు. నా కవమానకరమైనమాటయైనప్పుడదిసందేహ ... ... జెప్పఁదగినది సౌందర్యవతినై చక్రవర్తిపుత్త్రినైన నను వలచినవాఁడు నన్ను ప్రేమింపకపోవుటకంటెఁ

బరాభవము నాకున్నదా ? ఆతఁడు నన్ను పేక్షింపఁ డని మీరు ధారాళముగా నే నేమనుకొందునో యనుసంశయమైన లేకుండఁ బలికినారు. నాయాశాభంగమునకైన, నాపరాభవమునకైన మీరు విచారింపకపోవుటయే కాక యుత్సాహముం బొందుచున్నట్లు గూడ మీముఖవైఖరిచేఁ దెలియుచున్నది. ఆతఁ డింతవఱకు నన్నుఁ బ్రేమింపకపోవచ్చును గాని యిఁకముందు నేను జేయఁదలఁచినప్రయత్నమువలనఁ బ్రేమించునేమో- ప్రేమింపఁ డని మీరెట్లు స్పష్టముగఁ జెప్పఁ గలిగితిరి? ఇప్పటివఱకే హృదయపరీక్ష కాని ముందు హృదయమందుఁ గలుగఁబోవు మార్పుల నెట్లిప్పుడే పరీక్షింపఁగలిగితిరి? ఒకవేళ నన్నాతఁడు ప్రేమింపఁడనియే నిశ్చయపఱుపుఁడు- ఆమాటనంత విస్పష్టముగఁ జెప్పి నామనస్సును మీరు బాధింపవచ్చునా ? మీకింతభయహీనత యెందువలన ? నామనస్సునకు నొప్పికలిగినయెడల నేను జేయలేనిపని యేదైన నుండునా ? నాబాధకు దగ్గించుటకు మీవంటివారు నాకుఁ దోడ్పడుటకు బదులుగా బాధను వృద్ధిచేయుటకై ప్రయత్నించుట తగునా? సరే యిది యటుండనిండు. ఆతఁడు నన్నుఁ బ్రేమించుట కేమియభ్యంతరము ?

ము—ఆతఁడు మఱియొక కాంతను వలచినాఁడు.

ప—ఆ కాంత యాతని ప్రేమించినదా?

ము—ఆ.

ప—సరే! 'ఆ' యని యాకాశమంత నోరు తెఱచియుంటివే. ఆతని పై నాప్రేమ యెక్కువయో నాకీమె యెక్కువయో బాగుగా సిద్ధాంతించి చెప్పఁగలరా ?

ము—రెండిటికి భేదము చెప్పుట కష్టము.

ప—కష్టముకావుననే మిమ్ముదుగవలసివచ్చినది. మీకున్నయాత్మ సాక్షాత్కారము నాకున్నయెడల నీసరికిఁ బ్రపంచము నల్లలాడించియుందును. ఆతనియెడల నాప్రేమయెక్కువయో? నాప్రేమ యెక్కువయో? మహాత్మా! ఇది ముఖ్యమైన యంశము. విచారించి బాగుగాఁ జెప్పవలయును.

యు—చెప్పుటకుఁ బ్రయత్నింతును. ప్రక్కగట్లనున్న ప్రబ్బిపూలు తమమొగములను నీటిలోఁ జూచుకొనుచు నవ్వుకొనుచుఁ దలలూచుచుండఁ జల్లగ నిమ్మళముగఁ బచ్చని బీళ్ల నడుమఁ బ్రవహించు పంటకాలువవలె యామె వలపున్నది ఎత్తైనకొండలనుండి ప్రచండధాటితోఁ బ్రబలవేగముతోఁ దలక్రిందుగా గ్రిందఁబడి ప్రవాహవేగమునఁ గూడఁ గొట్టుకొనివచ్చుచున్న చెట్లతో రాలతో భయంకరములైన సుడిగుండములను గలిగించుచు నాకాశమంతయుఁ గ్రమ్ముకొనిన తుంపరలమబ్బులందు శక్రధనుశ్శతమును గల్గించి, చల్లనయ్యును, దీక్ష్ణమైన యాకృతితో సుందరమయ్యును రౌద్రమైనరూపముతో వెలుగొందుమహాజలప్రపాతమువలె మీవలపున్నది.

ప—నాకీపాము మెలికమాటలు నచ్చవు. నాప్రేమయే యెక్కువయని ఘంటాపథముగాఁ జెప్పరెందుచేత? మరియొక్కసారి యడుగుచున్నాను. చెప్పరెందుచేత?

ము—ఒకటి యెక్కువయేమి? ఒకటి తక్కువయేమి? దాని నైజమది. దీనినైజ మది. మనోమార్దవమును గలుగఁ జేయు మర్దళధ్వనివలె యీమెవలపున్నది. హృదయావేగమునర్పు భేరీరవములె మీయనురాగ—

ప—అదిగో! తిరుగ నట్టి కప్పదాఁటుమాటలం డెదరేల? నాప్రేమయే యెక్కువయని స్పష్టముగాఁ జెప్పుఁడు. అందువలన ననర్థ

కథన దోషము మీకు లేదు. నేనూరక యడిగితిని గాని నాకంటె నామె హృదయము మీకు బాగుగా నెఱుఁగుదురా ? మీ యాత్మదర్శనము నాయనుభవముకంటె నెక్కువది కాదు. ఆమెకు నాయందెంత ప్రేమయో ! నాతోఁ జదువుకొన్న యింతకు ఆడది. మెత్తమెత్తని మొడలు, భయశీలములై సాధువులైన కన్నులుగల లేడ తెదుకుట్టది. ఆఁ యని నేనట్టి కన్నెట్ట చేయు నరికిఁ గన్నులనీరు తెచ్చుకొనదే! ఎక్కడఁ గూల బహుమన్న నక్కడఁ గూరుచుండదే! ఏవస్తువైనఁ గావలయునని యెప్పుడైన నంకుపట్టు పట్టినదా ? ఇట్టి యెడలఁ దాను దానిని సాధించి తెచ్చుకొనుదాఁకఁ దహతహలాడినదా? పట్టి బావ కడికుఱ్ఱదాని కనురాగము బలిష్ఠముగా నుండునని మీ రెట్లనుకొంటిరయ్యా? దేహతత్త్వమును బట్టియే యనురాగతత్త్వము గూడ నుండును. ఈమాట లేల? నాయనురాగమే యెక్కువ యని మీ రొప్పుకొంటిరి కాని- మఱియొకటి —

ము—మఱియొకటి చెప్పెదను.

వ—ఏదది?

ము—ఆతని కాతనికాంత యం దెక్కువ ప్రేమమో? కళింగ రాజ పుత్త్రికి మీయం దెక్కువప్రేమమో మొలచినది మొలచినట్లు, పూచినది పూచినట్లు చెప్పెదను.

వ—ఆమాట మీ రనఁదగదు. నేను వినఁదగదు. తెలిసినదా?

ము—మీరు ప్రేమించినయాతఁడు మిమ్ముఁ దిరుగఁ బ్రేమింపకపోవుటచే మీకు మహాపరాభవము కలిగెనని మీ రిదివఱ కిబ్బంది పడితిరే! మిమ్ముఁ బ్రేమించిన కళింగరాజపుత్త్రిని మీరు ప్రేమింపక యిట్లు పరాభవించుట మీకు బాగుగానున్నదా? మీమనస్సువంటిదే కదా యాతనిమనస్సు కూడను—

ప—మీ రిటనుండి వెడలిపోవలెననియె మొదలఁ జెప్పెను. అంతేకాని యాతనినిగూర్చి చెప్పకుఁడు. ఒక్కఁడు మనస్సంతయు నాక్రమించుకొనినాఁడు. రెండవవానికిఁ దావేది? ఒక్కగవిసెనలో రెండు వీణ లిముడునా? సన్న్యాసులు మాకాఁడువారివంటివారే కాన నామనస్సు కల్లడిచేయుచున్నాను. ఆతనిగూర్చి మీరు పెదవి కదల్పవలదు. కాని యాతనిఁగూర్చి మీ రిదివఱకుఁ జెప్పినారు ఇప్పుడుకూడఁ జెప్పినారు. మీకీపట్టుదల యెందులకో నాకు సందేహముగానున్నది. ఏమి చెప్పెదరు?

ము—ఆత్మసాక్షాత్కారము నప్పుకొనఁబోవుచున్న మీతండ్రిగారు నాకు గానఁబడి కళింగరాజపుత్త్రికవంక వ్రేలుచూపి నాకు సంజ్ఞ చేసినారు తండ్రిగారియాజ్ఞ మీఱుట మీకుఁ దగదు. కావున నట్లు చెప్పవలసివచ్చినది.

ప—ఏమైననుసరే! నేను వినను. ఆతనిఁగూర్చి మీరింకఁ జెప్పఁదలఁచునెడల మీరు దయచేయవచ్చును.

ము—(తనలో) కానీ, యెంతైన సహించి యీమెమనస్సు మఱల్చి తుదకీమెనే వివాహముచేసికొనవలయును. లేదా ముక్తికాంత నపేక్షింపవలయును. వేఱుమార్గము లేదు. ఇక్కడ నే నుండవలయును. పాప్మరనేమో గుని భయముగానున్నది (ప్రకాశముగా) రాజ్ఞీమణీ! మీయిష్టము.

ప—మీరు చెప్పనక్కఱలేదు. నాయిష్టమే కాని మఱియొకనిమాట నేను వినను.

ము—మీరడిగితిరి కావున నింతదూరము మాటలాడవలసివచ్చినది. మఠనిర్మాణమునకు నేను గోరినధన మిచ్చు టవకాశమున్నయెడల నీయఁగోరెదను. కాదేనిఁ గొలఁది దినములుండి తీసికొనిపొమ్మన్న నట్లు చేసెదను.

వ—మీధనముకొఱకు మిమ్మాఁపనక్కఱలేదు. మీధనమిచ్చినయెడల మీరు పోవుదురేమోయను సందేహమున నిప్పుడీయను. మీరు కోటలోఁ గొలఁదిదినము లుండవలయును.

ము—అయ్యయ్యో! సన్యాసిని నే నిచ్చటనుండుట తగునా?

వ—తగునో తగదో నన్నడుగువాఁ డెవ్వఁడు? నే నెవనికిఁ జెప్పవలసి యున్నది? నాకోటలో నాయధికారము- నాయిష్టము- మీరు కోటలో నుండవలయునని యెందులకుఁ జెప్పితినో చెప్పనా? కారణము చెప్పినఁగాని మీరుండరేమోయను సందేహము చేతఁ జెప్పుచున్నానని యనుకొనవలదు. మీరుండనియెడల నుండవలసిన క్రమమేదో నే నెఱుఁగుదునయ్యా? ఇఁక మూఁడు నాల్గుదినములలో నాకోటలో సమస్తవైభవములతోఁ బెండ్లియో, సంఘమరణమో జరుగనైయున్నది. ఆమహావసరమున నెవరిహృదయ మెట్లుండునో నేను మిమ్మడిగి తెలిసికొనవలసియున్నది. అందుకొఱ కుండుఁడని చెప్పితిని. మీరిఁక మాటలాడఁదగదు. నేనుగూడనట్టే మాట లాడఁదలఁచుకొనలేదు. మాలిని మీకుఁ గనఁబఱచు బసలో మీ రుండవలయును.

ము—మూఁడు దినములకంటె నాకు వ్యవధి దయచేయకుండినను నింతసేపు మీకు శ్రమయియ్య సాహసించినందులకు మన్నింపవలయును.

వ—చాలసేపు గూరుచుంటినని మీరు నన్ను దెప్పిపొడుచుచున్నారా? మీవైఖరి మీమాటలు నాకుఁ గొంత విశ్వాసభాజనములుగా నుండుటచేత నింతసేపు మాటలాడితిని. మాలినీ—

ము—(తనలో) ఇన్నిమాటలలో నీయొక్కమాటయే నాకుఁ గొంత యనుకూలముగ నున్నది. [మాలిని ప్రవేశించును]

ప—మాలినీ! ఈయనను నాయనగారి పూజామందిరమున విడియింపుము.

మా—చిత్తము. మహాత్మా! దయచేయుఁడు.

ము—రాజ్ఞీమణీ సెలవు.

ప—సరే.

(మాలిని మురళీమనోహరుఁడు నిష్క్రమింతురు.)

స్ఫటికశాలలో విజయనారాయణవర్మ యున్నాఁడు. ఎల్లుండియో యాపలెల్లుండియో నాకోర్కెకడ్డుగనున్న రత్నప్రభను దీసికొని యామెతండ్రి వచ్చును. ఇంతలో నాకస్మికముగ నీబైరాగి యెవఁడో వచ్చినాఁడు. ఇటుపైని విజయనారాయణవర్మతోఁ దిరుగ మాటలాడి రత్నప్రభతో మాటలాడవలయునో, రత్నప్రభతో మాటలాడినపిమ్మట నే విజయనారాయణవర్మతో మాటలాడవలెయునో, వీరిద్దఱికంటె ముందుగ నామెతండ్రితో మాటలాడవలయునో యీనడుమ నెప్పు డెక్వడు బైరాగితో మాటలాడవలయునో యేమియుఁ దెలియకుండ నున్నది. ఎచట దట్టమైన మంచున్నప్పుడు కన్నెంత నిష్ప్రయోజనమో నాయూహయంత నిష్ప్రయోజనముగనున్నది. కథనంతను ముందు కుదుర్చుకొని యంకవిభజన మొనర్పకుండ మొండిత్రోపుగ నాటకమారంభించు కవివలె నే నీప్రయత్నమున దిగితిని. ముందంక మేదో యాతనికిఁ దెలియదు. నాకుఁ దెలియదు. తుదకెట్లో యతనిగ్రంథము పూర్తియగును. నాప్రయత్నము పూర్తియగును. కట్లో స్తుతులో అతనికి సుఖమో దుఃఖమో నాకు—

(నేపథ్యమున) సెలవుప్రకారము బైరాగిని బసలో దింపితిని.

ప—మాలినీ! ఇటురా.

[మాలిని ప్రవేశించును.]

నాకుఁ దలనొప్పి వచ్చుచున్నది. సాయంకాలము కావచ్చుచున్నది. ఉద్యానవనద్వారము తెఱచియుంపుము. అటకు వచ్చెదను.

మా—చిత్తము. (పోఁబోవును.)

వ—చూచుము ఉద్యానవనమున నూరక కూర్చుండు నెడలఁ దలనొప్పి తగ్గదు. కొంతవ్యాయామము మావశ్యకమేమో విజయనారాయణవర్మ నాతోఁ గుండబంతియాటకు వచ్చునేమో కనుగొందువా?

మా—చిత్తము.

(పోఁబోవును.)

వ—చూచుము మాలినీ! అక్కడ దున్నావు కాదా? అతనితోఁ జెప్పవలదు. నామూలమున నాతనికి శ్రమ మెందులకు? మేనమామ కూఁతుతోఁ బ్రధానమగునని యాతఁడు సంతోషముతో నున్నాఁడు కాఁబోలు నేమి?

మా—భోజనమైనపిమ్మట నాతనిని జూడలేదమ్మా.

వ—మంచిపని చేసితివి. చూడకపోవుటయే నాయిష్టము చూచుకు. సంగీతము వినుటవలనఁ దలనొప్పి సర్దుకొనునేమో?

మా—ఆస్థానగాయనీమణిని బిలిపించనా?

వ—పోనిమ్ము. పాడునప్పుడు దానిమొగముచూచక మఱింత తలనొప్పి వచ్చునేమో. ఏమియువలదు. అభ్యంగన మొనర్చుకొందును. అన్నియు సిద్ధపఱుపుము.

మా—చిత్తము.

[(మాలినిపోవును.)

వ—మాలినీ! ఇటురా?

[మాలిని ప్రవేశించును]

ఉన్న వేడిమి తలలోఁగాదు. మనస్సులో నున్నట్లున్నదే. అభ్యంగనమెందులకు? నిద్రకు మంచు సిద్ధపఱుపుమని యాస్థానవైద్యునితోఁ జెప్పుము. ఈరాత్రి నేను భుజించను. ఇప్పుడే పండుకొందును. పడకగదికి దారిచూపుము. మాలినీ! రత్నప్రభ మూఁడు నాల్గుదినములలో వచ్చును. సంగీతములుకావు. నాటకములుకావు. సరసములైన సమస్తవినోదములు నామె గౌరవార్థమేర్పఱుపవలయునని నే నాజ్ఞాపించినట్లు మంత్రితో వెంటనే చెప్పుము. నాకుఁ బరాకు హెచ్చుగనున్నది. నడు.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.



# పద్మిని

## తృతీయాంకము.



ప్రదేశము—పద్మినియంతఃపురము.

[ప్రవేశము—పద్మిని, రత్నప్రభ.]

ర—అక్కా! నాకొఱ కిన్ని వేడుకలు చేయించవలయునా? ఇన్ని యుత్సవములు చేయించవలయునా? నేనేమి క్రొత్తదాననా?

ప—క్రొత్తదాన వైనయెడల నీకొఱ కేమియుఁ జేయింపక యేపోవుదును. ప్రాఁతదాన వగుటచేతనే యందులోఁ జిన్నదాన వగుటచేతనే నీరాకకు నే నింతసంతోష మొందుచున్నాను. నావలెనే నాప్రజలుకూడ సంతోషింపవలయునని యాజ్ఞాపించినాను. నిన్నుఁజూచి యెంతకాలమైనదో చెప్పు. ఈలోపల నొక్కలేఖయైన వ్రాసితివా? నాక్షేమ మెప్పుడైనఁ గనుగొంటివా? నాప్రాణము లన్నియు నీపైఁ బెట్టుకొంటినిగదా! నీకింత దయలే దెందుచేత? తుదకు నేను వార్తనంపినకాని వచ్చితివే కావే!

ర—అక్కా! అన్నిలోపములను మన్నింపవలయునని విధేయురాలనై మ్రొక్కుకొంటిని గాదా! అన్నిలోపములు తీఱునట్లిప్పుడు చేతులుకట్టుకొని వచ్చితినిగాదా?

ప—వచ్చితివమ్మా! నా కెంతసంతోషముగా నున్నదనుకొన్నావు! కాని యిక్కడనుండి నిన్ను నేను బొమ్మనియనువఱకుఁ బోవని నామీఁద నొట్టుపెట్టుకొనవలయును.

ర—నీవు సెలవిచ్చి పంపువఱకుఁ బోవనని ప్రమాణము చేయుచున్నాను. అక్కా! ఇట్లావరించువా రెవరమ్మా! మాతల్లి కాలధర్మమునొందినది నీవే నాకింక తల్లివి. సోదరివికూడను.

ప—చెల్లెలా! నాకుమాత్ర మెవరున్నారు. తల్లిదండ్రులు లేనేలేరు. తో డంతకంటె లేదుగదా? నాకు నీవు, నీకు నేను చెల్లెలా! పూచినగులాబి మొగ్గలాగున నీవెంతకన్నులకింపుగా నున్నావే. కోక కచ్చపోసి కట్టుకొనలేకపోయితివా? త్రై చేతులంతపొడుగుగాఁ బెట్టుకొంటివేమే? అంతపై కొగలాగుకొని పోకుండ నంతక్రిందికి సాగిపోకుండ నాత్రైకచేతు లెట్లున్నవో చూడు. జిగినీలోనినడిమి రాయిమాత్రము చాల బాగుగా నున్నదే. నాకంటె రెండేండ్లు చిన్నదానవైనను నీవెంతగోవగా నెదిగినావే! మొదటినుండియు మెత్త యొకలిదానవు. నీవేలాగునుందువో యని నామనస్సులో నే నెన్నిబొమ్మలుగీచికొన్నాననుకొన్నావు? నీవు పొడుగెదిగిపోవుదువేమోయని నే నెంతయో జడిసినానుసుమా! నీగుండ్రమొగమునకుఁ బొట్టిగా గుమ్మటములాగున గుడించిన ట్లుండుటయే సొగసమ్మా? మొత్తము మీఁదఁ గన్నులునిండుగఁ జప్పజప్పనఁ దోటకూరకాడలాగున బాగుగ నెదిగినావే.

ర—అక్కా! నీవుమాత్రము బాగుగా నెదుగలేదా?

ప—అడుగనక్కఱలేదు. వట్టి కట్టపడి. ఒడలుఁగట్టుపడియే. మనస్సున గట్టుపిడియే.

ర—కొందఱకుఁ గాపురము చేయుచుండగా నొడలువచ్చునమ్మా! అక్కా! కళింగరాజపుత్త్రినిమాట స్థిరపఱచితివా?

ప—నాకంటెఁ జిన్నదానవయ్యును ముందుగా నీబావను స్థిరపఱచుకొని నీవు కూరుచుంటివి. కాని యింద ఱట్లుస్థిరపఱచుకొనఁ

గలరాకిఇంటిలో మగఁడు-మేనయత్తకొడుకు. ఎప్పటికప్పు డే చాటునుండియో చూచిచూడనట్లు రవంత చూడఁగొనవచ్చు ను. ఆడియాడనట్లు రవంతమాటలు కలుపవచ్చును. చేసిచేయ నట్లు కొసంత యుపచారములు సేయవచ్చును. నీసుఖము నీసంతోషము, నీయుత్సాహము నాకెందులకు వచ్చునమ్మా! అనఁగననఁగ నొకరాజఁట. ఆరా జేదోసముద్రతీరమందలి యొకపట్టి కధికారియఁట. ఆతని కొకకొడుకఁట. ఆతని మొగ ము క్రొంతిమొగమో కొంపముంచ్చుమొగమో తెలియదఁట. ఆతఁడు మైనపుదిమ్మయో రాతిబొమ్మయో యంతకంటెఁ దె లియదఁట. ఆతఁడు భోగాలవీధి భోగయ్యయో ఆడారిదద్ద య్యయో మొదలే తెలియదఁట. ఆతనినోటఁబల్లేరుకాయయో తలలో మట్టిముద్దయో మనసులో దుష్టపురుగో హృదయ ములో నిసుకదిబ్బయో బొత్తిగాఁ దెలియదఁట. ఆతని జేసికొన వలసినదని తండ్రిగారి యాజ్ఞయఁట. చక్రవర్తిని యతనినింకఁ జెట్టఁబట్టి సింహాసనముపైఁ బెట్టలేదని యూరియమ్మలక్కలు బుగ్గలు నొక్కుకొందురఁట. నాబ్రదు కిట్లున్నది. ఏమదు గుదువు!

ర—నీవు చక్రవర్తినివగుటచే నందఱు నీయాజ్ఞకు బద్ధులుకాదా! కళింగరాజునకు వార్తనంపి పెండ్లికొడుకును బిలిపించి యాతని విద్యాబుద్ధులు స్వరూపస్వభావాదులు పరీక్షించుటకై కోట లోఁ గొన్నిదినములు పెట్టుకొనరాదా?

వ—నాగ్గుదినము లింటియొద్దఁ గట్టిపై చికొని పాలుచూచుకొని పరి వృత్తించుకొనట కిదియేమిబట్టబేరమా? నాపెండ్లిమాట కేమికాని ముందు నీప్రధానపునంగతి నిశ్చయింపవలసియు న్నదికాదా?

ర—అక్కా! మీకు మాయందున్న యభిమానమునకై మేము మిక్కిలి సంతసించుచున్నాము. ఏనాఁటిపాఠశాల, ఏనాఁటిచిన్నతనము, ఏనాఁటిచదువు. మాప్రధానమునకై మీరింత యాత్ర పడుచున్నారు. నాయందలి మీ ప్రేమకు హద్దున్నదా?

ప—నీమీఁద నాకు, నామీఁద నీకుఁ బ్రేమలున్ననేమి లేకున్ననేమి? మీకిద్దఱకన్యోన్యానురాగ మున్నదిగదా! ఆసంగతియే యిప్పుడు కావలసినది.

ర—(సిగ్గు నటించును.)

ప—సిగ్గుపడుటకాదు. ఆఁడుదానికేమి మగవానికేమి యిదే మహావసరము. బహుజాగరూకతగఁ బ్రవర్తింపవలసిన సమయము. ఎత్తునుండి దిగునప్పుడు కాలుజాఱినయెడలఁ గూడఁ దీసికొనవచ్చును విషము ప్రమాదమున మ్రింగినసైన వాంతిచేసికొని తనువు నిలుపుకొనవచ్చును కాని దుర్భ్రాంతిచే మగనిని స్థిరపఱచుకొన్నయెడలమాత్రి మఱికఁ గూడిరాదు. వాలుకఱంపముచేఁ గోయించుకొనవచ్చును. కన్నులలోఁ జీలుకొట్టించుకొనవచ్చును. అగ్నిజ్వాలను గౌఁగిలించుకొనవచ్చును. కాని నచ్చని పతితో మాటలాడలేము. అతని జూడలేము. అంత దూరమునసైన నిలువఁబడలేము.

ర—అక్కా! అట్టిచిక్కెన్నటికిఁగూడ రాదు. ఆధైర్యమున్నది.

ప—చెల్లెలా! నీమనస్సు నీవెఱుఁగకుండఁ జెప్పుచున్నావని నాకు భయముగానున్నది. బాల్యమునుండి మనమెవనితోఁ బెరిగి తిరిగి యాడుకొంటిమో యాతనిపై మనకుఁ బత్యనురాగ ముండదు సుమా! అదివట్టిచనవుసుమా? సంతతమైన పరిచయముకంటె నదియెక్కువది కాదు. అదిమైత్రికాని మఱియొకటి కాదుసుమా! దానినినీవు భర్త్రనురాగమని భ్రమించుచున్నావని నే నాఁడో

శనపడుచున్నాను. ఎదుటఁబడినప్పు డుప్పొంగిపోవుట, రవంత కనుచాటైనయెడఁ గ్రుంగిపోవుట, యొక్కచోఁ గూరుచుందమని, యొక్కచో నాడుకొందమని, యొక్కచోఁ బండుకొందమని సంతతము దేవులాడుచుండుట యనునవి మైత్రికిఁ బత్యనురాగమునకు సమానధర్మములే. అయినను దానికి దీని కెంతయో భేదమున్నది. మైత్రిలో మానుషికతేజముమాత్రమే యున్నది. పత్యనురాగములోఁ బ్రధానముగ దైవతేజమున్నది. దానిలో నెంతకలసియున్నను విభిన్నత్వమున్నది. దీనిలో నెంత దూరముననున్నసరే యేకత్వమున్నది. దానిలో నైహిక గంధమే కాని దీనిలో నాముష్మికసౌరభముఁగూడ నున్నది.

ర—అక్కా! నే నేమి చిన్నదాననా? నా కిన్ని చెప్పవలయునా? భగవంతునికటాక్షమున మే మత్యంతసుఖులమై యుండఁ గలము.

క—(తనలో) అబ్బ! ఆలాగేమి? నిన్నాతనితో సుఖపడనిచ్చెదనా? నీభర్త నాబాహుబంధమందైన నుండవలయును. పరమపదమందైన నుండవలయును. నాసంకల్ప మంతే. (ప్రకాశముగా) చెల్లెలా! నేను నీ కింతదూరము చెప్పుట కేదో కారణమున్నదని గ్రహింపకున్నావు. నీ వెఱుఁగని యంశ మేదో నే నెఱుఁగుదునని నీవు తెలిసికొనఁజాలనప్పుడు నే నేమిచేయఁగలను? నీ యిష్టము.

ర—అదేమమ్మా! అట్లనుచున్నావేల?

క—ఏమియులేదు చెల్లెలా! నీకుఁ బ్రధానదినమున నెట్టి చీర కావలయునే? చూడు నిమ్మపండువంటి నీతనుకాంతి కూదాపట్టుచీర బాగుగా నుండునేమో? కాక నాచురంగుపట్టుచీర బాగుగా

నుండునేమో? దీపాలకాంతి నాకు వచ్చునిరం గెంతశోభావంతముగ నుండు ననుకొన్నావు. నామట్టునకు నాకు—

ర—అక్కా! ఈమాటల కేమికాని యదేదో చెప్పవా?

వ—ఏమున్నది చెల్లెలా! మగజాతివలపు మెల్లకంటిచూపు నొక్కటే తీరు. అది యొకతెపై నున్నట్లగపడుటయే కాని మరియొకతెపై నుండును.

ర—(నవ్వుచు) ఇంతేకద!

వ—నేను జెప్పినది నీవు గణింపనేలేదా? మీఁదుమిక్కిలి పరిహసించుచున్నావా? నీవు పరిహసించుటకు నే నంతప్రకృతివిరుద్ధముగ మాటలాడితినా? మగవాఁడు స్వభావమునఁ జంచలుఁడగునా కాదా? ఒక్కమాట. గాలి యిప్పు డిటువీచుచున్నది. రవంత పైకిఁ బొమ్ము. క్రిందనిటువీచుచుండఁగనే యదియచ్చట మరియొకవైపున వీచుచుండును. మరిరవంతపైకిఁ బోయినయెడలనది వేఱొకవైపు వీచును. ఏవైపువీచుటకూడఁ గాసింతసేపే. అటులే మగవానిమనస్సునకుఁగూడ నన్నియరలు, నన్నియంతరువు, లన్నియవలోకనము లున్నవి. మగవానివలపునమ్మినయెడల నిఁకనడుగనా? కొఱవిదయ్యపువెల్తురును బట్టి పోయిన నెంతదుర్గతియో మగవానివలపునమ్మి యనుసరించిన యాఁడుదాని కంతదుర్గతి.

ర—అమ్మా! నమ్మక మన మేమిచేయవలసినది?

వ—ఇదిగో! బుద్ధిలేక, పరిశీలనలేక, దూరదృష్టిలేక కట్టుకొన్నవారి సంగతి చూచుచున్నాముకాదా? మగఁడు వీధిలోఁ దూనీఁగ, పెండ్లామింటిలోఁ జేదపురుగు. మగఁడు పణ్యవీధిలో వసంతకోకిల, పెండ్లాముపంచపాళిలో బోదురుకప్ప. వానిమెడలోఁ బూలదండ. దీనినెత్తిపై నీళ్ళకుండ. వాడుకన్ను. ఇదిబుస్సు.

ప్రపంచమునను న్నన్నికష్టములకుఁగూడ నసందర్భవివాహములే మూలము. మగజాతి నెన్నఁడు నమ్మఁదగదు.

ర—మగజాతియెట్టిదైన మనకేమమ్మా! మనమగలు బుద్ధిగలిగియున్న మనకుఁ జాలదా?

శ—మనమగలా? నాకు మగఁ డేఁడి? ఇఁక నీమగనిసంగతియా? ఆ తేఁడుమాత్రము లోకాతీతుఁడాయేమి? చెల్లెలా! ఏటిమాటలు! కోడిమాంసము శాకచేయునని చెప్పినవ్వాఁడు నీయింటికోడి మాంసముమాత్రము మేహశాంతికాఁబోలు నేమి?

ర—అక్కా! స్పష్టముగాఁ జెప్పుచున్నాను. నామగఁ డిప్పటివఱకు నాయందే పంచప్రాణములను బెట్టుకొనియున్నాఁడు. ఇఁకముం దెట్లుండునో యని సందేహించు టెందులకు?

శ—ముందటిసందేహ మక్కఱలేదు. ఇప్పటివఱకు నీమగఁడు నీయందే లగ్నచిత్తుఁడైయున్నాఁడా?

ర—ఔఁ.

శ—హాహాహా! (నవ్వును)

ర—అక్కా! అట్లు నవ్వెద వేల?

శ—నీనమ్మకమునకు సంతోషించుచున్నాను.

ర—కాదు. నా తెలివితక్కువకుఁ బరిహసించుచున్నట్లు నాకుఁదోఁచుచున్నది. అభినందనపునవ్వేదో యధిక్షేపణపునవ్వేదో నేను దెలియలేనా? అక్కా! ఎందులకు నవ్వితివో చెప్పవా?

శ—నీపైఁ బ్రేమచేఁ జెప్పవలయుననియే యున్నది. నీనమ్మకముచూడ నాకు భయము వైచుచున్నది. నీవు రవంతసందేహవతివైయైన మొదల నీసరికిఁ జెప్పియుండనా?

ర—అక్కా! నాకుఁ గష్టముగ నున్నది. చెప్పవా?

ప—నీకష్టముకంటె సహస్రగుణము లధికమైనకష్టము నే నొందుచున్నానని నీ వెఱుఁగుదువా? అయ్యయ్యో! మి మ్మిక్కడకు రప్పించితినే. మీకుఁ బ్రధాన మొనర్చుటకు నిశ్చయించితినే. మీతండ్రినిగూడ రమ్మంటినే. అయ్యయ్యో! పెద్దలచే నిశ్చితమైన పెండ్లి. పీటలమీఁదఁ బెండ్లియే నామహాప్రారబ్ధమువలనఁ గాక నే నెందుల కింతనఁ జిక్కుకొంటిని? ఏమైననరే చెప్పకుండనుండుటయే మంచిదేమోయని యొకవంక నిశ్చయపఱచుకొందమన్న—

ర—అక్కా! నాబ్రదుకునకుఁ బ్రధానమైన రహస్యమును నీ వెఱిఁగి యుండియుఁ 'గప్పిపుచ్చి న న్నిట్లు వదలివేయుదువా? నాపై నీకు దయలేదా?

ప—దయలేదా యనుమాట యనుటకు నీకు నోరెట్లు వచ్చినదే. మాతండ్రి నిన్ను నాకంటె నెక్కువగాటముగఁ గౌఁగిలించుకొని లాలించలేదా? నీకంటె నేను రెండేండ్లు పెద్దదాననగుటచే నిన్ను నేనెత్తుకొని మోయలేదా? అయ్యయ్యో! ఒక్కచోఁ గుడిచితిమే- ఒక్కచోఁ బండుకొంటిమే- ఒక్కచో నాడుకొంటిమే- ఒక్కచోఁ జదువుకొంటిమే- నీ కెనిమిదవయేట జ్వరమురాగ నీ ప్రక్కయొద్దఁ గన్నీరొత్తుకొనుచు నేను గూలఁబడి యుండలేదా? నీ వేడివేడిపెదవులను నేను ముద్దుఁగొనలేదా? నీ కాళ్ళు లొత్తలేదా? చక్రవర్తిపుత్త్రిక కేవల ప్రేమచేతనేకదా నీకిట్టి దాసికనిచేసినది! నీకుఁ గలిగిన జబ్బు నా కేల గలిగించితివి కావోయి భగవంతుఁడాయని నేను ప్రార్థించిన ప్రార్థన నీ వెఱుఁగవు. కాని నేనెఱుఁగనా? భగవంతుఁ డెఱుఁగఁడా? ఇప్పుడు నీపై నాకు దయలేదా యని యడుగుచుంటివా?

ర—అక్కా ! కడుపులోనిమంటచే బుద్ధిలేక యిటులంటిని. క్షమిం పుము. సర్వవిధముల నాయెడల దయాస్వరూపురాలవై ప్రవ ర్తించితివి. కావున నిప్పుడుకూడ నాదయయే కనఁబఱచి—

వ—అయ్యయ్యో ! ఆదయయే నన్నిట్లు బాధించుచున్నది. ఆదయయే నా కిప్పుడు కంఠపాశమైనది. హరి హరీ ! రత్నప్రభా ! నీవు నాకింత ప్రేమాస్పదురాల వేలయైతివి ? నీవు నాకింత ప్రాణా ధిక వేలయైతివే ! ఊరిలోని యంద అమ్మలక్కలవంటిదానవే నీవైనయెడల నీ సౌఖ్యముకొఱకు నేనింత దేవులాడియుం దునా ? నీ బాధయే నాబాధయనుకొని యింతకొట్టుకొని పోకయుందును గదా! వెఱ్ఱిప్రేమ యెన్నఁడు తగదు తగదు. ప్రేమయేమో మెత్తనిదని యనుకొందుము. కాని బాధపెట్టు టలో శత్రుత్వముకంటెఁ బ్రేమయే యెక్కువ గట్టిదమ్మా !

ర—నాకుఁ గావలసినమాట చెప్పక మఱియేదో చెప్పుచున్నావు. నాకు దడయెత్తుచున్నది. గుండెలలో బరువెక్కుచున్నది. అమ్మా వేగ చెప్పుము?

వ—చెప్పినందువలన నాకేమి పాపమో యని లోన నేనెంత చింతిం చుచున్నానో నీ వెఱుఁగుదువా ? నీచింతయే హెచ్చని నీ వనుకొనుచున్నావు.

ర—చెప్పినందువలన నీకుఁ బాపములేదు. సరేకదా నాబాధ తగ్గిం చుటచే నీకుఁ బుణ్యముకూడ సిద్ధించును.

వ—(తనలో) ఓభగవంతుఁడా ! రత్నప్రభ నూఱేండ్ల బ్రదుకెక్కడ భగ్నమగునో, యను భయముచేత నామెయందలి యవ్యాజ మైన ప్రేమ ప్రేరణచేయుచుండ, సత్యవాక్యమందలి గౌరవ ముచేత, నప్రియమైన సత్యమామె చెవిని వైచుచున్నాను. తండ్రీ ! ఈపాపమునకు నాకు శిక్షలేకుండఁ గటాక్షింపుము.

శిక్షింపఁదలఁచితివేని- నీవు నాకిచ్చు నరకబాధనైన సహింతు
ను గాని వాచెల్లెలిదుఃఖమును నేను జూడలేను. పరమేశ్వరా!
నీ యిష్టానుసార మాచరింపుము. (ప్రకాశముగ) రత్నప్రభా!
నీ కీభర్తతగఁడు. నీ వాతనిని వదలుకొనుము.

ర—(తనలో) భగవంతుఁడా! ఎంతకాలపుటనుబంధ మెంతలోఁ
దెగింపనున్నావు. నీదయచేతనే మాకన్యోన్యానురాగము కలి
గినదని సంతసించితిని. నీ దయచేతనే యది యిప్పుడు దగ్ధమై
పోవలసినదా? కానీ! తలయొగ్గితిని. (ప్రకాశముగా) అమ్మా!
నా కాతఁడు తగఁడని చెప్పితివి. నీవింతదనుక నాడిన మాట
లను బట్టియే యీసంగతి యిదివఱకే గ్రహించితిని. ఆతనిదో
షమేదో యది నాకుఁ గావలయును.

వ—అది నీకక్కఱలేదు. నాకు నక్కఱలేదు. ఇతరులకునక్కఱలేదు.
నీవు స్థిరచిత్తవు. నీతత్త్వమున కాతఁడు పనికిరాఁడు. సత్యమున
కసత్యమునకుముడి వేయవచ్చునా? వైరాగ్యలలకు లాంపట్య
మున కదుకునా? వేదాంతవిద్యకుఁ గొక్కోకమునకు లంకె వే
యవచ్చునా?

ర—తగదు. నిజమే తగదు. ఆతఁ డసత్యవాదియుఁ జంచలుఁడు నెట్ల
య్యెనో నాకుఁ దెలియవలదా?

వ—నీకేల తెలియవలయును?

ర—ఆతనిఁ జేసికొందునని మాతండ్రితోఁ జెప్పియుంటిని. ఇప్పు డాత
నిని నిరాకరించుటకు మాతండ్రితో హేతువు చెప్పనక్కఱ
లేదా? మాతండ్రిమాట యటుంపుము. నామనస్సాతనిని గురు
వుగ, భర్తగ, దైవముగ, భావించుకొనుచున్నది. నామనస్సు
నైన సమాధానపఱచుటకు నాకుఁ దగినకారణ ముండవలదా?

వ—నీ మనస్సాతనినుండి యింకఁ దిరిగి పోనేలేదా?

ర—తిరిగిపోయినది. కాని—

వ—ఇఁకఁ గాని యెందులకు? భ్రమరము పద్మలతను వదలిపోయి నది. అది తంగేడుపూవుమీఁద వ్రాలిననేమి? ఉమ్మెత్తపూవు మీఁద వ్రాలిననేమి?

ర—ఆఁ. ఆఁ. నన్ను విడిచి పరస్త్రీ ననుసరించెనా? ఆ! ఎంతమాట! ఎంతమాట! కాని—ఆపరస్త్రీ యాతనిని నావలెఁ బ్రేమించినదేనా?

వ—ఓసి వెఱ్ఱిదానా! ఆసంగతి మనకెందులకే—అది యాతనిని ముద్దుకొనునో మూఁతిమీఁదఁ బొడుచునో! ఆగొడవతో మనకేమి సంబంధము.

ర—(ఉస్సురనుచు) నిజమే- మనకు సంబంధములేదు. మనస్సు చెదరిపోవుటచేత నేదో యంటిని. కాని—కాని—యాపరస్త్రీ యాతని నమ్మునా? "పురిటిబిడ్డకడనుండి మేనమామకూఁతును జేసికొందునని చెప్పి మామగారి కాళులంటి బాసచేసి యిన్నిసంవత్సరము లింటిలోఁ గూరుచుండి మనుగుడుపుఁ బెండ్లికొడుకువలె నారగించి, బలసి తీఱఁ బ్రధానపువేళ మేనమామకూఁతును మోసగించి వదలిపెట్టి నన్నుఁ బ్రేమించితినని పలుకుచుఁ గులుకుచు నాయొద్దకు వచ్చితివా మూర్ఖా! విశ్వాసద్రోహీ" యని యాపరస్త్రీ యాతనిమూఁతిమీఁద రోఁకలిపుచ్చుకొని పొడువవలసిన దందునా కాదా?

వ—చెల్లెలా! ఆగొడవతో మనకు సంబంధములేదని నేను జెప్పఁగ నావని నీ వంటివి కాదా! తిరుగ నామాటయే పట్టుకొని ప్రసంగింతువేల?

ర—అన్నమాట నిజమే- ఇఁక నాసంగతి తలపెట్టను. కాని యొక్క—

సంగతి మాత్రము చెప్పుము. అది యెవతెయో మాత్రము చెప్పుము. నీ కాళులు పట్టుకొందును.

ప—చెప్పెదను. కాని నీవు రహస్యముగ నుంతువా ?

ర—ప్రమాణము చేయుమన్నఁ జేసెదను.

ప—నీమాటయే నాకుఁ బ్రమాణము. నీయోగ్యతకు హద్దు లేదని నే నెఱుఁగనా ?

ర—రహస్యముగ నుంతును.

ప—నీతండ్రితో నైనఁ జెప్పఁదగదు సుమా ?

ర—చెప్పను. చెప్పను.

ప—నారాయణవర్మ యిటనే యున్నాఁడు. నీ వాతని యెదుటఁబడి తుచ్ఛుఁడా! మోసకాఁడా! యని తిట్టవు కదా !

ర—ఆతని మొగమింకఁ జూచుటకూడనా ?

ప—అటులైన విను- ఆపరస్త్రీ యెవతెయో చెప్పనా ?

ర—చెప్పుము.

ప—నీబలాత్కారమున దైవము ఖమును జూచి చెప్పుచున్నానుజుమా!

ర—చెప్పుము.

ప—ఆపరస్త్రీ నేనే—

ర—ఆఁ. ఆఁ. నిజముగనే- నిజముగనే- అక్కా ! ఇట్టి సమయమునఁ బరిహాసమాడుట తగునా ?

ప—నేనెవో నారాజ్యకష్టములఁ గూర్చి ముచ్చటించుచుండఁగా నాతఁడు నన్ను వలచెననియుఁ బెండ్లి చేసికొని రాజకీయవ్యాహారమున సహాయుఁడుగా నిటనే యుండుననియుఁ గంఠోక్తిగాఁ బలికినాఁడు.

ర—ఆహా ! ఎంత యొడలు తెలియనితనము— ఎంత నిర్భయము— చక్రవర్తిని నే! మహాధికారిణి వే! తానెక్కడ? తన బ్రదుకే

క్కడ ? తనస్థితి యెక్కడ ? తన కిదియేమి పోగాలము ? బ్రదికి బాగుపడఁదలఁచుకొనలేదు కాఁబోలు ?

వ—ఆతని నిర్భయత్వమును నేనంత గణింపలేను. నిజముగా గాటమైనవలపునకున్న నిర్భయత్వము. దేనికిని లేను. బందిపోటు దొంగకు భయమున్నది. అసత్యవాదికి భయమున్నది. ఆహావశూరునకు భయమున్నది. పిశాచావిష్టునకు భయమున్నది. కాని, యనురాగవశునకు భయములేదు. చక్రవర్తిని నిట్లడిగినాఁడేయని యంటివి. చక్రవర్తిని నైనందుల కితరులకంటె నెక్కువ ధనమున్నది. ఎక్కువ భూమియున్నది. ఎక్కువ యధికారమున్నది. ఎక్కువ బాధయున్నది. ఎక్కువ యేడుపున్నది. కాని మగనియొద్దఁ బండుకొనునవసరమునఁ జక్రవర్తిని యెంతయో చచ్చుముష్టిదికూడ నంతయే కాదా? అతఁడాదృష్టినే చూచినాఁడు. ధనమున్నప్పుడులాభమనినష్టమని దేవులాట. సిగ్గున్నప్పుడు పైవారని తనవారని భేదగ్రహణము. భయమున్నప్పుడు హెచ్చువారని క్రిందివారని వ్యత్యాసజ్ఞానము. అంతేకాదా? నేనందులకంతగణింపలేదు. కాని యాతనికి సర్వసామాన్యమైనకన్నె లేకపోయెనేయని నేను వింతపడితిని. ఒకవస్తువును వదలి వేఱొకవస్తువును స్వీకరించునప్పుడు రెండవది మొదటిదానికంటె గుణోత్తరమై యుండవలయును గాదా? చీమచంచదారపలుకునువదలిగోదుమగింజను జేరునా? పాలకుండనువదలి గంజిముంతకుటి నపేక్షించు పిల్లికిఁ గన్నున్నదనవచ్చునా ? గులాబిపూవువాసనచేఁ జొక్కిన తుమ్మెద యెట్టిగన్నెరు జేరుటకిచ్చగింపవలసినదా? అయ్యయ్యో! కోకిలయేదో చెముడుకాకి యేదో పశువులపిల్లవానికైనఁ దెలియునే-సీతాఫలపుష్ప మేదో- సకలఫలచంపక మేదో—

ర—అక్కా! యెందులకీమాటలు.

ప—మాటవచ్చినది కావునఁ జెప్పవలసివచ్చినది. నిజము నేనుదాఁచిన యెడల లోకము దాఁచునా? నీసౌందర్యమునకు నాస్తుతి కావలసివచ్చిన దనుకొంటివా? నేనొకతెను స్తుతించుదాననేయను కొంటివా? నాలోప మేదో నేను గుండపగులఁగొట్టినట్లు చెప్పుదానను. ఎదుటిగుణ మేదో సరిగా గ్రహించి యున్నదున్నట్లు చెప్పుదానను. ఎల్లపుడు సత్యమే పలుకుదును. సత్యమునే ధ్యానింతును. సత్యమునే యారాధింతును. సత్యమే నాదైవము. ప్రపంచమంతయు సత్యమందే నిల్చియున్నదని నాదృఢవిశ్వాసము. అందుచేఁ జెప్పుచున్నాను. నీవు నాకంటె ననేకగుణములు సౌందర్యవతివి. కొందఱకుఁ గన్ను సోగగా విశాలముగా బాగుగనేయుండును- ముక్కు ప్రత్యేకముగాఁ బరీక్షించునెడల సూటిగాఁ దగుమాత్రమైన యెత్తుగాఁ జివర రవంత మొనగల వంపుకలిగి బాగుగనేయుండును. గడ్డముమట్టునకుఁ బ్రత్యేకముగాఁ జూచినయెడల నదియు మలచినట్లు రవంత గుంటకలిగి బాగుగనేయుండును. కాని యివియన్నియుఁగలపి చూచినయెడల నదియేమికర్మమోకాని తీర్థమునకుఁ దీర్థము- ప్రసాదమునకుఁ బ్రసాదముగాఁగొందఱకుండును. కళకట్టనిదే. ఏచెవికాచెవి బాగుగానున్నను రెండును సమానముగ వ్రాలక, యొకటివ్రాలి యొకటి యెత్తిపెట్టుకొని యున్నయెడలఁ గుక్కమొగము చక్కగ నుండునా? కంటిసోగతో ముక్కు సూటితనముకలసి గడ్డపుగుండ్రతనముతో మేళవించి గప్పుమని యనిర్వర్ణ్యమైన కాంతిపుట్టినప్పుడుకదా సౌందర్యము- తాంబూలరక్తియెట్టిదో, స్వరసంఘాత మాధుర్యమెట్టిదో, మనస్సుల కలయికవలన మైత్రియెట్టిదో సౌందర్య మట్టిది. అట్టిది

నీలోనున్నది. నీకున్న యవయవములు నాకుమాత్రము లేవా? కాని యిక్కడఁ గూడికయే లేదు. ఉన్నరవంతకూడికలోఁ గావలసినంత యపస్వరము వెలితియు నున్నవి. ఇదికాక—

ర—అక్కా! నన్ను క్షమింపుము. నీవే నాకంటె సర్వవిధముల సౌందర్యవతివి. కాని నన్నుఁబ్రస్తుతాంశమునుండి యెంతదూరమో తీసికొనిపోయితివి. నాదృష్టిమాత్రము మచ్చటనే యున్నది. సరే కాని యాతఁడు నిన్ను వివాహము చేసికొందునన్నప్పుడు నీ వేమంటివో రవంత చెప్పవా?

హ—ఓసి పెట్టిదానా! ఈమాత్రపుమగఁడు దొరకినాఁడని యుప్పొంగి పోయి యొప్పుకొంటి ననుకొనుచున్నావా?

ర—అమ్మా! నేనంత తుచ్ఛురాలనా? మొగము వాఁచునట్లు తిట్టనే తిట్టితివో తలపగులునట్లు కఱ్ఱతీసికొని వేసితివో తెలియఁగోరి యడిగితిని.

హ—ఏమిచేసితినో నేను జెప్పుట యెందులకు? రేపటెల్లుంట నీకుఁ దెలియకపోవునా?

ర—అమ్మా! రేపటిదాఁక నే నిక్కడ నుండుటెందులకు? ప్రధాన మేదో భగ్నమైనదికదా! మగఁడు ముద్దులైనాఁడుకదా! బ్రదుకు పరశురామప్రీతియైనదికదా! ఇఁక నే నిక్కడ నెందులకు?

హ—ఎందులకో చెప్పెదనువినుము. నన్నాడినమాటలకుఁగాదుసుమా నిన్నాతఁడు పరిత్యజించినందుల కాతనిని గారాగృహమందుంచినాను కోటలోఁ దిరుగవచ్చునే కాని దాటిపోఁగూడదు. కాని యాతఁడట్లుబద్ధుఁడైనట్లెఱుఁగఁడు.

ర—అమ్మా! దేవతలు మెచ్చఁదగినపని చేసితివి! నామనస్సు కొంత సంతుష్టి నందినది.

వ—అతనికిఁ గఠినముగఁజెప్పి బుద్ధితెప్పించి యాతనిచేఁ దిరుగ నీకా ళులు పట్టించెదనో లేదో చూడు. అందుకొఱకు నీవిక్కడ నుండవలయును.

ర—నామనస్సు విరిగిపోయినది. ఇంక నాతనితో ననుబంధమా? మే ము మేనత్త మేనమామబిడ్డలమై యేపాపమునవో పుట్టినందు ల కాతఁడు చచ్చినయెడల నాకుఁ బత్నిణి - నేనుజచ్చినయెడల నతనికిఁ బత్నిణి - ఇంతకంటె మాకిఁక నేదియులేదు.

వ—సరి. ఈమాటలకేమి? నీవుండకతప్పదు.

ర—అక్కా! క్షమింపుము. నేనుండను. మాతండ్రియొద్దకుఁబోదును.

వ—మీతండ్రి కిదివఱకే సెలవిచ్చి పంపితిని. అదిగాక నీవు వెం టనే వెడలినయెడల మీతండ్రికి సందేహము కలుగదా? పాడైనదేదో చక్కఁబఱచుకొనవలయును గాని, తొందర పడుట తగునా? అదిగాక చెల్లెలా? నేను నిన్నుఁ బంపించు వఱకు నీవిక్కడ నుందునని బాసచేసితివికాదా? నీ విప్పుడు మాటతప్పుదువా?

ర—బాసచేసితిని - అందుచే నటులే - యుండెదను - కాని నన్ను శీఘ్రముగఁ బంపవలయుననిమాత్రము ప్రార్థింతును.

వ—సరే! నీవు పూజాశాలయొద్దకుఁబోయి యక్కడనున్న జ్యోతిషి కునిఁ జూడుము. అతఁడు దివ్యజ్ఞాని - అతఁ డేమైన మంచిమాట లు చెప్పును. కవంతసేపు వినుము.

ర—నే నాతనిఁజూడ నంగీకరింతునా?

వ—అక్కో! అతఁడు సన్యాసి. నే నాతనితో మాటలాడలేదా? నీవు పిల్లవు. నీకు సందేహమెందులకమ్మా? చూడు నీవు త్వరగఁ బొమ్ము - అతఁడు నీహృదయమును గనిపట్టును గావున నాతని తోఁ బ్రత్యేకముగ నీసంగతులేవియుఁ జెప్పనక్కఱలేదు.

ర—అటులే-

(రత్నప్రభ నిష్క్రమించును.)

వ—ఈమె కాతనికిఁ బూర్తిగాఁ జెడినది. అతనికిఁగూడ నీమెతోఁ బూర్తిగా జెడునట్లు చూడవలయును. అందుకొఱకే యీమె నిట నుండుమని చెప్పవలసివచ్చినది- మాలినీ!

[మాలిని ప్రవేశించును.]

నీవు వెంటనేపోయి శారదాలయములోనున్న రత్నప్రభతండ్రి నెవ్వరు చూడకుండ నీతోటలోనుండి పాణిద్వారమున నిటకుఁ దీసికొనిరమ్ము- అయ్యో! అట్లు మొద్దులాగున నిలువఁ బడెదవేమి?

(మాలిని నిష్క్రమించును.)

మాలినీ! ఇటురా! (మాలిని ప్రవేశము) నీవిటు వచ్చుచుండగా రత్నప్రభను జూచితివా?

మా—చూచితిని.

వ—తనతండ్రి తన గ్రామమునకు వెళ్ళినాఁడాయని నిన్నామె యడుగలేదుకద!

మా—లేదు.

వ—ఈవేళ నెప్పుడైన నిన్నామె యడిగినయెడల నుదయమందే రాణిగారు సెలవిచ్చి పంపినారని చెప్పవలయునుజుమా ?

మా—ఆమె నన్నేల యడుగునమ్మా?

వ—ఆమెదాసి జబ్బుచేఁ గదలలేకుండ నున్నది. కావున నిన్నడుగునేమో లే- సరే నీ విఁకఁ బొమ్ము. చూడు మాలినీ! యోగియొద్దకుఁ దన భవిష్యద్వృత్తాంతమును దెలిసికొనుటకు రత్నప్రభ వెళ్ళెదనని చెప్పినదిలే. ఆమె నక్కడకుఁ దప్పకుండఁ

బొమ్మని చెప్పుము- ఆమె యేమియడుగునో - నీవామెతో మాత్రి ముండవలదు. (మాలిని నిష్క్రమించును.)

అట్టివెల్తురు, అట్టిచీఁకటి, ఇట్టినవ్వు, అట్టియేడుపు, ఇట్టియాకాశగమనము, అట్టియధఃపతనము, ఇట్టికౌఁగిలింత, అట్టిగొంతుకోఁత, ఇట్టియమృతము, అట్టివిసము, రాగమున కివి లక్షణములు. సముద్రపుఁబోటుకంటె రాగ మెక్కువదూకుడుగలది. పాటులో సముద్రము రవంత మెల్లగజంకునేమో కాని, రాగపుఁదీఁతయొక్కక్షణమే. రాగ మెంతగాఢమో యంతవేగముగ నశించును. చెడఁగొట్టువారిలో నున్నది. కాని దానిలోఁ బటుత్వములేదు. వీరికిఁ బూర్తిగాఁ జెడిపిమ్మట నాకేమైన లాభించునేమో? చూడవలెను. లాభింపదా? పోనీ వారికి లేదు. నాకు లేదు. కాని వారికి లేకపోవుటయే నా కున్నదానిగా భావించి నేను గొంత సంతోషింతును. ఎవరిదో దగ్గు వినఁబడుచున్నది. మాలినీ! గోపాలవర్మగారు దయచేసినారా?

[నేపథ్యమున] వచ్చినారమ్మా! [మాలిని ప్ర.]

ప—తనపుత్త్రికవంటిదాననైన నన్నుఁ జూచుట కాతనికి సందేహ మెందులకు? నీవు నాప్రాణమిత్త్రమైన రత్నప్రభను గంటిరెప్పవలెఁ గనిపట్టి యుండుము. (అపవారించి) రత్నప్రభయొద్దకుఁ గాని యోగియొద్దకుఁ గాని నీవు పోయినయెడల నీగొంతు కోసెదను. గో. వర్మ నిక్కడికి రమ్మని చెప్పుము.

(మాలిని నిష్క్రమించును.)

[గోపాలవర్మ ప్రవేశించును.]

ప—రావయ్యా! ఈయుదయముననే నీగ్రామమునకుఁ బోవుటకు నాసెలవుకొఱకు వార్తనంపితివికాదా? నీవు వెళ్ళితివని యనుకొంటిని జుమా!

గో—నే నట్టివార్త వంపనే లేదమ్మా!

వ—ఆలాగా! నీవు సెలవుకోరిన జైబివ్వరో చెప్పినారయ్యా! పోనీ! నీవుంటివి. ఆనందముగ నున్నది. చూడు వర్మా! నారాయణవర్మను జేసికొనుటకు నీపుత్త్రిక కిష్టమున్నదని నీతో నామె చెప్పినదా?

గో—చెప్పినదమ్మా.

వ—బాగుగా జ్ఞప్తికిఁ దెచ్చుకొని మఱిచెప్పుము.

గో—అమ్మా! ఎంతపెద్దవాఁడనైన నీసంగతియే మఱచిపోదునా. నాతో నెన్నిమారులో చెప్పినది.

వ—నీపిల్లను మేనల్లున కిచ్చుటయందు నీవు దృఢసంకల్పుఁడవైయుండుటచేత నీమనస్సునకుఁ గష్టముగా నుండునని యట్లుచెప్పియుండునా? రవంత యాలోచించి మరిచెప్పుము.

గో—తల్లి యీనడుమను బరలోకగతురాలైనది. కాని యామె యున్నప్పుడామెతోఁగూడ నెన్నిమారులో చెప్పినది.

వ—వయసురానప్పుడు వచ్చియు రానప్పుడామెచెప్పిన మాటలకు లెక్కయేమి?

గో—ఇప్పుడు తనకిష్టముకాదని చెప్పినదా అమ్మా?

వ—కంఠోక్తిగాఁ జెప్పినది. చూడువర్మా! నాకు రత్నప్రభ బహిఃప్రాణమని నీవెఱుఁగుదువా?

గో—ఎఱుఁగకేమమ్మా.

వ—నీతోడను నీభార్యతోడను జెప్పని యీరహస్యమును నాతోఁ జెప్పుటచే నాయందామె కెంతవిశ్వాసమున్నదో స్పష్టమైనదా? నేనామె హృదయమును మార్చెదను. ఆమె నిక్కడఁ గొన్నిదినము లుంచుకొని ప్రధానము జరిగించి మరిపంపెదను.

నీవు సందేహింపవలదు. ఆమెను నీతో నిప్పుడు పంపఁదలఁచు
కొనలేదు.

గో—అక్కఱలేదమ్మా! మీ కిష్టమైనంతకాల ముంచుకొనవచ్చును. మీ రెట్లులైన నీశుభకార్యమును జేయించి నన్నుఁ గృతార్థుని జేసి మాపెద్దలను దరింపఁజేయవలయును. నాకొక్కతెయే బిడ్డ. దీనిని దల్లిదండ్రులులేని మేనల్లుని నొకవిధముగాఁ బెంచుకొంటిని. ఇద్దఱును నాకు రెండుకనులు. (కనులొత్తుకొనును)

ప—అబ్బ! నాకే గుండె చెదటిపోవుచున్నది. నీవిబ్బందిపడుట వింత యా? ఊరకుండుము. ఆబాధ్యత నంతను నాపై విడిచిపెట్టి పొమ్ము.

గో—చిత్తము. (నిష్క్రమింపఁబోవును.)

ప—వర్మా! నీవెట్లు వచ్చితివో యటులే నీబసకుఁబోయి మీగ్రామమునకు వెంటనే పొమ్ము. చూడు నీకూఁతునుజూచి యామెతోఁజెప్పి మరి పోయెదవా యేమి?

గో—చూచియే పోయెదనమ్మా.

(నిష్క్రమింపఁబోవును.)

ప—వర్మా—ఇప్పుడు—తిరిగిచూచి—ఆమెతోఁ జెప్పవలసిన విశేషాంశము లేమైన—నున్నవా?

గో—ఏమియు లేవమ్మా.

ప—నేనెందుల కింతతొట్రుపాటు పడుచుంటినో చెప్పెదను విను. నేను జెప్పినమాటలవలన నీమనస్సు చెడినది. చెడినమనస్సు నీముఖముమీఁద స్పష్టముగా గనఁబడుచున్నది. నేను దిరుగఁ జెప్పిన ధైర్యపుమాటలవలన రవంత వెలవెల తగ్గినదేమో కాని చిత్తాందోళనము స్పష్టముగాఁ గన్నులలో బుగ్గలలోఁ జిత్రింపఁబడియున్నది. ఇఁక నీపుత్త్రికస్థితిని విను. ఇంతకాలము

తల్లిదండ్రులతో నసత్యము చెప్పి మోసగించితివిగదా యని చింతచే సిగ్గుచేఁ జివికి చివికి పోవుచున్నది. ఇట్టి మనస్థితులలో మీరు సమావేశమగుట తగదని నాకుఁ దోఁచుచున్నది. ఆమెను జూచి నీకు రవంతకోపము వచ్చునో, నిన్నుఁ జూచి యామె యేమనునో? నా కాసన్నివేశము స్మరించు కొలఁది గుండె దడదడలాడుచున్నది. అదిగాక తన రహస్యము నీకో వెంటనే చెప్పితినని యామెకు దోఁచినయెడల నాయందామెకున్న మొగ్గర మిఁక నుండునా? అది తగ్గినయెడల నేను మీ కార్యముచేయఁగలనా? నా కీసందేహములు కలుగుటచేతనే నింతయుంజెప్పనొల్లకున్నాను. నా తెలివితక్కువయూగా యేదో నేను జెప్పితిని. నీవు పెద్దవాఁడవు. నీ చెప్పుచేఁతలలో నుండవలసినదానను గానా? నీ కేది బాగుగా నుండునో యది చేయుము.

గో—అమ్మా! మీరు చెప్పినమాటలు నాకు బాగుగా నచ్చినవి. నేను నాపిల్లను జూడకుండ వెంటనే పోవుదును.

వ—నీవు నావలన విన్నమాటలు విననట్లే యుండవలయును జుమా!

గో—అమ్మా! ఎంతమాట! నాకు సెలవు.

వ—నేను నీకు రమ్మని వార్తనంపుదును. అప్పుడు రావలయును. నీ పిల్ల కేమియు లోపములేకుండ నేను సంరక్షింతును. నీయొద్ద నున్నట్లే యుండును.

గో—అంతకంటె సర్వవిధముల నెక్కువగా నుండునమ్మా.

వ—సరే—పొమ్ము.

(గోపాలవర్మ నిష్క్రమించును.)

ముసలిపందను మోసగించుటయైనది కదా! ఇఁక నారాయణవర్మను జూడవలసియున్నది.

(నిష్క్రమించును.)

ఇది తృతీయాంకము.

---

# పద్మిని

## చతుర్థాంకము

ప్రదేశము — కోటలో నారాయణవర్మ గది వెలుపల.

[ప్రవేశము — నారాయణవర్మ — పద్మిని.]

నా — ఎందుల కీయాలస్యము? త్వరగఁ జెప్ప వేఁడుకొనుచున్నాను.

ప — ఏమున్నది? మగవానికి బుద్ధిలేదు. ఇంగితజ్ఞానము లేదు. అందులో స్త్రీహృదయమును గ్రహించుటకు శక్తియే సున్న. తా నెవ తెనైన వలచినయెడల నది తన్నుఁగూడ వలచెనని నమ్మియుండును. అది రవంత నవ్వినయెడలఁ దనసరసతకై మెచ్చెనని యనుకొనును. అది వాలుఁగంట రవంతచూచినయెడలఁ దన సౌందర్య మనుభవించుటకని నమ్మును. అది కాసంత సాలోచనముగ నున్నయెడలఁ దన్నుఁజిత్తమున ధ్యానించుచున్నదని భ్రమించును అదియొక నిశ్వాసమును విడువగఁ దనకై లోపలఁగుమిలిపోవుచున్నదని తన్ను బహుమానించుకొనును. చిత్రవిచిత్రలీలావిలాసములు సహజముగ సరసిజాక్షులనుండి వెలువడును. అవి యన్నియు నీకొఱకేయని నీవు భ్రమింపవచ్చునా? గులాబిపూవు నీకొఱకే వికసించి పరిమళించుచున్నదా? ఇంద్రధనుస్సు నీమొగమునకు మంగళపుటారతియిచ్చుటకే యనుకొనుచున్నావా? కోకిల నీకొఱకే పాడుచున్నదా? చంద్రకళనుండి వెడలువెన్నెలకు నాఁడుదాని మందహాసమునకుఁ బరమార్థమున భేద మేమున్నది? బ్రహ్మజాతి

వజ్రపు జిలజిలకుఁ బడతికంటి మిలమిలకుఁ బ్రకృతితత్త్వమున భేదమేమున్నది? సృష్టియంతయుఁ దనకొఱకా? అఁడుది ప్రత్యేకము తనప్రక్కలోనికా? మగవానియంత స్వార్థలో లుఁడు, నహంభావదూషితుఁడు మఱియొకఁ డున్నాఁడా?

నా—చక్రవర్తినీ! ఇంతదూర మెందులకు? ఆమె నన్నంగీకరింప లేదా యేమి?

వ—ఉండు. ఉండు. చెప్పుచుండగా నడుమనడుమను దొందరపడి యడ్డువచ్చెద వెందులకు? నీ స్వరూపస్వభావములు గని నేను మెచ్చినదాననే యగుదును గాక. నీ యందుఁ బరిపూర్ణప్రేమ మున్నదాననే యగుదును గాక. నేను నిన్ను మహోన్నతస్థితి లోనికిఁ దెచ్చుటకు సంకల్పించుకొనినదాననే యగుదును గాక. చక్రవర్తిని మాటలాడుచుండగ నీవు నిర్భయముగ నుప న్యసించుటతగునా?

నా—రాజ్ఞీమణీ! క్షమింపుము. మనసులోని యాందోళనముచే నట్లా నర్చితిని క్షమింపుము. ఆమె నన్ను వలచియుండనే లేదా?

వ—అమె నిన్ను వలచినదని త్రికరణశుద్ధిగా వలచినదని నీవునాతోఁ జెప్పుటచేత నామెనా యిబ్బందిపెట్టితిని. నీమాటలనునమ్మి యామె నేలయడిగితినాయని నేనా యిబ్బందిపడవలసి వచ్చినది. నిన్నుఁ బ్రేమించిన దెవతెయో ప్రేమిం పని దెవతెయో యీమాత్రమైనఁ దెలిసికొనలేకపోయితి వేల? ఎదుటఁబడినప్పు డెల్ల గర్వ్వోరచేసికొనిచూచుచు మా టలాడుటకుఁ బ్రయత్నించినప్పుడెల్ల ముసిముసినవ్వులతోఁ బ్రక్కకొత్తిగిల్లుచు కణుగుమెణుగులేక మెత్తమెత్తగనున్న యాఁడుది నిన్ను వలచినట్లా? ఎదుటబడి హుంకరించి మాట లాడి నిర్లక్ష్యముగఁ బ్రవర్తించుచున్నయాఁడుది నిన్నుఁ బ్రే

మింపనట్లా? ప్రేమతత్త్వనిర్ణయ మున కింతకంటె మంచి సాధనము నీకుఁ దెలియదు కాఁబోలు నేమి?

నా—(తనలో) ఈమె నన్ను వలచుచున్న దేమో యని మొదటరవంత సందేహించి యాసందేహము తప్పని వదలుకొంటిని. ఈమె మాటలు తిరుగ నాసందేహమును గలిగించుటయే కాక బలపఱుచుచున్నట్లున్నవి. నన్నుఁ జేపట్టవలయు నను వాంఛచే నీమెయే నాప్రియురాలిమనస్సు చెడఁగొట్టినదేమో? అయ్యయ్యో! ఆప్రేమ చెడఁగొట్టినను బోవునది కాదే! ఏమో! దురదృష్టదినములలోఁ బోఁకూడనిదొకటియున్నదా? మహామారి యింటఁ బ్రవేశించి నాశనము చేయునప్పు డొక్క ప్రాణియైన మిగులవచ్చును. భూకంపముచే గ్రామము దిగుమనిపోయినప్పు డొక్కపుట్టయైన మిగులవచ్చును. ప్రబలమైన దురదృష్టమువచ్చినప్పుడు పోకుండ మిగులున దేదియు లేదు. పంచభూతములకంటెఁ బ్రకృతిశక్తులకంటె భాగ్యహీనతయే బలవత్తరమైనది అట్టిచో రత్నప్రభ వలపుపోయిన దనగ నాశ్చర్యమేమి?

ప—నారాయణవర్మా! ఏమి యోజించుచున్నావు?

నా—రత్నప్రభకు నాపైనున్న యనురాగము పోవుటకుఁ దగినంత కారణ మీదినమునఁ గ్రొత్తగా నాకస్మికముగా నేమి కలిగినదో యని యోజించుచున్నాను.

ప—పోవుటా? పోయినదని యెవరు చెప్పినారు? ఉన్నప్పుడుకదా పోవుట?

నా—అయ్యయ్యో! లేనే లేదా?

ప—లేదని చెప్పవలసివచ్చినందులకు విచారించుచున్నాను. నేను మొదట నీతోఁ జెప్పలేదా? నీస్థితిగతులఁ బట్టి నీయందామెకు

సహజముగ నుండునది జాలికాని వలపుకాదనిచెప్పలేదా? నా మాటనీవు విశ్వసించితివా? అందుచేతనే నయ్యాను నీకంటె నేనే యెక్కువ ప్రకృతిజ్ఞానముకలదాన నని స్పష్టపడినదా?

నా—(తనలో) లేనేలేదేమో? ఉన్నయెడల నొక్క పూటలో నేపోవునా? రాజ్యము పోయినను దల్లిదండ్రులు పోయినను బరతంత్రుండనై పరాన్నభోజినైనను రత్నప్రభా! నీవెప్పటికైన నాదాన వగుదు వను నాశతో, గష్టములన్నిటిని సహించి యుంటినిం. ప్రాణప్రియా! ఒక్క నీయాధారముననే బ్రదికియుంటినని నీ వెఱుంగవా? తరంగములు లంబికియుబికి యెగిరియెగిరి మింటిపైనురుగుమియుచుండ, గాలి భయంకరారావముతో సముద్రము నాచెంత నీచెంత వాయించుచుండ మొండితనమున బ్రదుకందలంచి బారెడు బాడిదెక్కి నాశ్రయించి సముద్రమునుదాంటుచుంటిని. అక్కటకూడ జారిపోవలసినదా? ఊరుచేర్చును సుఖమిచ్చునని నమ్మకొన్న యెదుటిదీవము కొఱవిదయ్యమేయయ్యెనా?

ర—నారాయణవర్మా! దీర్ఘాలోచనచేయుచున్నావే.

నా—నాపై నామె కనురాగము లేనే లేదా?

ర—అదేపనిగ నడిగెద వెందులకు? లేదని నాచేనన్నిమారులనిపింతువయ్యా! ఒక్క లేదుకంటె మూండు లేదుల కెక్కువ బలమున్నదా? అటులైన లేదు, లేదు. లేదు. లేకపోయినంతమాత్రమున నేమిపుట్టిమునింగిపోయెను? నీకుం బెండ్లికాదేమోయని విచారింతువా? ఏదో యూరుపేరులేని రూపము గుణములేని కొంకినక్కవచ్చునేమో యని సంకోచింతువా? ఇదియెందులకు వదలిపోయినదో? దానినెత్తిమీంద నెగిరిపోవుననదే నీకువచ్చునేమో? నీవెంతభాగ్యవంతుండవు కావంసియున్నదో? నీవెంత

రాష్ట్రాధిపతిని కాఁదగి యున్నావో? వెనుకటి యుపాశకములనిఁకఁ దలపెట్టకుము.

నా—(తనలో) ఈమెయే నాకొంపతీసినది! రత్నప్రభతో నేమిమాటలుచెప్పి యామెమనస్సు చెడఁగొట్టినదో. ఆమెనాకొక్కసారియైనఁ గానఁబడలేదు సరేకదా దాసిచే వార్తనైనఁ బంపలేదు. ఆమెను దండ్రిని వెనుకకు బంపివైచినదేమో? (ప్రకాశముగా) చక్రవర్తినీ! రత్నప్రభ యిప్పు డెచ్చటనున్నది ?

ప—ఇక్కడనేయున్నది. ఇంటికిఁ బోయెదనని తొందరపడినను బంపలేదు. మేనత్తకొడుకును జేసికొందునని యింతకాలము బ్రాసచేసి యిప్పుడిట్లొనర్చుట యిహమునకుఁ బరమునకుఁగూడ లోపమని బోధించుచున్నాను. ఇఁక రెండుమూఁడుదినములు నయమున భయమున బోధింపఁదలచినాము.

నా—(తనలో) ఆహా! తిరుగ నీమె యిట్లనుచున్న దేల? ఈమె చెడగొట్టలేదుకాఁబోలు!

ప—నారాయణవర్మా! నీవు విచారింపకుము. మిమ్ముల నిద్దఱను నేను గలుప సమకట్టితిని. నాప్రయత్నము సాగకపోవునా? ఎటువచ్చినను నామెమనస్సన్యాక్రాంతమయ్యెనేమో యని సందేహముగానున్నది.

నా—(తనలో) ఆఁ. ఆఁ. అన్యాక్రాంతముకూడనయ్యెనా? ఆయన్యుఁడెవఁడో? నన్నుగాదనినాస్థానముననిలువఁబడిన యన్యుఁడెవఁడు? ఇంతయప్పటినుండియు గలసియుంటిమే. వివాహమనఁగనేమో రవంత తెలిసినప్పటినుండియు నన్నుఁదక్క నామె యితరులను జూడనేలేదే. నామాటలుతక్క నితరులమాటలు వినలేదే. నాతోఁదక్క నితరురులతో మాటలాడనేలేదే. ఇప్పుడామె కొంత కాలమునుండి యాశపడిన యన్యుఁ డెవ్వఁడు?

[వెనుకవ్రక్కఁ గొంతదూరమున రత్నప్రభ ప్రవేశించుచును.]

రత్న—అయ్యా! అయ్యా! (వెనుకనున్న గదితలుపు తట్టుచున్నది.)

[మురళీమనోహరుఁడు తలుపుతీసికొని ప్రవేశించుచును.]

రత్న—స్వామీ! నమస్కారము.

ము—కల్యాణమస్తు. అమ్మా! మీరెవ్వరు?

రత్న—నేను గోపాలవర్మ పుత్త్రికను. మీరు మహానుభావు లని దివ్యకాలవేదులరని మిమ్ముఁ జక్రవర్తిని యాజ్ఞపై జూడవచ్చితిని.

ము—అమ్మా! దాసియైన లేకుండ నొక్కతెవే వచ్చితివేల?

ర—నా దాసికి జబ్బుగానున్నది.

ము—అమ్మా! ఇటఁ గూరుచుండుము. సంధ్యాసమయము కావున రవంతసేపు ధ్యానించుకొందును.

ర—అటులే.

చ—ఏమి నారాయణవర్మా! మాటలాడకుండ నున్నావు.

నా—ఆమె మనస్సు వ్యాకాన్తమైనదని చెప్పితిరికాదా? ఆయుయ్యఁ డెవ్వఁడో మీతో నామెచెప్పినా?

చ—అయినదని చెప్పితినా? నాకట్టిసందేహ మున్నదనియేకాదా చెప్పితిని. నేను జెప్పనిమాటలుకూడ నేలచెప్పెదవు? నీకల్పనాశక్తిఁ జూపను నాసత్యవాక్యములపైఁ బ్రయోగింతువా? నన్నుఁ దుదకు మిథ్యావాదినిని జేయుటకా?

నా—క్షమింపుము.

ము—(తనలో) అయ్యయ్యో! ఈమె నిచ్చటి కావక్రవర్తిని యేల పంపెనో తెలియదు. మాలిని నాయొద్దకువచ్చి తిరుగ నేమియుఁ జెప్పియుండలేద. ఇప్పుడీమె యేమడుగునో (ప్రకాశముగా) నీవు గోపాలవర్మ పుత్త్రికవా? సంతోషమే. నీప్రథా

నను కే ముహూర్తము పెట్టుమని చక్రవర్తిని నాకాజ్ఞాపించి నదిసుమా!

ర—నేనిక్కడా ముహూర్తమును గూర్చి రాలేదమ్మా! అప్రియత్న మంతయు భగ్నమైనదని యిప్పుడే తెలిసినది.

ము—చక్రవర్తిని చెప్పినదా యేమి?

ర—ఔను.

ము—(తనలో) చెప్పినదే యామె కాదు. చెరఁగొట్టినదికూడ నామెయే. ఆహాహా! తామరతంపరగ బ్రాఁకుచున్న తీఁగను ద్రెంపివైచినదే- చందురుఁగోసికొనఁగఁ జాచిన చేతిని దెగఁఱికినదే- నోటికెత్తుపానకలశమును బడ ద్రోచినదే. ఎంతపని చేసినది! నారాయణవర్మను దానే చేసికొనుట కెంతపని చేసినదో! నారాయణవర్మకు రత్నప్రభతోఁ జెడినది కాని తనకు నారాయణవర్మతో నదుకునా? నే నదుకనిచ్చెదనా? అట్లగునెడల నాబ్రదుకేమి కావలసినది? (ప్రకాశముగా) సరే; అమ్మా! నీవిప్పుడిచ్చటికేల వచ్చితివి? నీ భవిష్యత్తును దెలిసికొనుటకే నా?

ర—ఔను.

ము—అటులైన నాలోచించి చెప్పెదను.

చ—(వెనుకకుఁ జూచి నారాయణవర్మకుఁ గనఁబడునట్లుగా నాలుక కఱచుకొని ముక్కుపై వ్రేలు వైచికొని తలవంచుకొనును.)

నా—చక్రవర్తినీ! మీరట్లు పరితాప మొందుచున్నా రేల? మీరట్లు నాలుక నేలకఱచుకొనినారు?

చ—ఏమియు లేదు- ఏమియు లేదు- ఇది మనము మాటలాడుకొనఁ దగినస్థలము కాదు. ఉ. ఉఁ. త్వరగ- త్వరగ రమ్ము- (నడచుట నభినయించును.)

నా—చక్రవర్తినీ! ఏమంత సంభ్రమపడుచున్నారు?

వ—ఆసంగతి నీవడుగవలదు. నీతో మాటలాడుటకు నేనిక్కడ కేల రావలయును? నేనున్నచోటికిఁ బిలిపించినయెడల నీవు రాకుందువా? నేను మొదట నల్లచేయవలయునని యనుకొంటిని. పదికిమాలినబుద్ధి మారిపోవనా?

నా—అది మీయిల్లయి యిది కాకపోయినదా? అంతయు మీదే- కాని యిప్పుడు మీరంత పశ్చాత్తాపపడుట కేమియావశ్యకత కలిగినది?

వ—ఏదో కలిగినది. కలుగలేదు. ఆసంగతితో నీకుఁ బనిలేదు. కాని రమ్ము. త్వరగఁ బోవుదము.

నా—మీరంత పట్టుదలగాఁ జెప్పునక్కఱలేదు. నేను మీయాజ్ఞకు బద్ధుఁడను. మీరు దయచేయుఁడు. మీవెనుక నే వచ్చెదను.

వ—నీవు ముందు నడచినఁగాని నేనొప్పుకొనను. వెనుకఁ జూడకుండ నడచెదనని నాకుఁ బ్రమాణము చేసినఁగాని నేనొప్పుకొనను.

నా—(వెనుకఁజూచును.) ఆఁ. ఆఁ. (తెల్లబోయి నిలువఁబడును.) ఆతఁడెవఁడో ఆతనియొద్ద రత్నప్రభ కూరుచుండియున్నదే- సంధ్యానమయమగుటచే బాగుగాఁ గానఁబడకుండనున్నది.ఆమె రత్నప్రభయన్నమాట సత్యమే. ఆతఁడెవఁడో. ఇందుకొఱకే కాఁబోలు మేనత్తకొడుకును విడిచిపెట్టినది. హు.

వ—(తనలో) పరపురుషునితో మాటలాడుచుండగ రత్నప్రభ నీతనికిఁ జూపించితినిగదా! ఇప్పుడైన నీమెయం దాతనికి బూర్ణమైన రోఁత కలుగకుండునా? ఆమెయందు రోఁత పుట్టినతరువాత నాయందుఁ బ్రేమ మేలకలుగదు? ఏల కలుగకపోవునో చూ

చెనను (ప్రకాశముగా) రమ్ము. నారాయణవర్మా! మరియొక చోటికిఁ బోవుదము.

నా—ఇఁక మఱియొకచోటి కెందులకు ? కణకణలాడునిప్పులు నా కంటఁ బడినవి కాదా? ఇఁక మరియొకచోటి కెందులకు?

ప—నీవక్లేల చూడవలయును? అవిధేయుఁడా చూడవలదని నీకుఁ జెప్పలేదా? ఆఁడువారి కనేకరహస్యము లుండును. అందులో మగఁడని యనుకొనువానియందు విశ్వాసము లేనప్పుడు మఱికొన్ని రహస్యములుండును. అవియన్నియుఁ బనిలేక కనిపట్టి గుబ్బెటలు పడుచుండుట మగవానికి లక్షణమా? పాపము-పెండ్లియాడుపిల్లకు రవంతసేపొకస్వరూపము బాగుగా నుండుటచేత నాతనిమీఁద మనసుండును. మరి రవంతసేపటికింకొకస్వరూపముమీఁద మనసుండును. ఆతనితో మాటలాడినంతమాత్రమున నితనిపై మనసు లేదనవచ్చునా? ఇతనితో మాటలాడినంతమాత్రమున నతనిపై మనసు లేదనవచ్చునా? పదునాలుగేండ్లపడుచునకు సౌందర్యగ్రహణశక్తి చూపెంతరాలిరుచివలె సర్వదా చంచలముగ నుండునుగాదా? ప్రపంచజ్ఞానసంపన్నుఁడవైన నీవెఱుఁగవా? మొదట నీమీఁద రవంత యుండెనే యనుకో- ఇప్పుడు మఱియొక్కనిమీఁదికి మనస్సుపోవుటచేత నీమీఁద లేదు లేదనికూడఁ జెప్పనేజెప్పినది. ఆమె దాఁచిన దేమియు లేదే! తిరుగ నీమీఁది కామెమనస్సు రాఁగూడదా? రాకపోయినయెడల నేనూరకుండుదాననే యనుకొంటివా? రెండుమూఁడు దినములలోఁ బ్రధానముచేయుదునో లేదో నాశక్తిచూడు. ఆమాత్రముపట్టుదల పంతము లేనిదాననుగానయ్యా-

నా—ఇఁక రత్నప్రభను నాకుఁ గూర్చుటయందు మీరెవరును శ్రమతీసికొనవలదు. ఆమె నన్నిఁక నపేక్షింపనక్కఱలేదు. అందునుగూర్చి యెట్లు జరుగవలయునో జరుగును గాని నాస్థానమందు నిల్చుటకు సాహసించిన యాతఁ డెవఁడు?

ప—ఆతనిని గొట్టెదవా యేమి? మంచి సరసముగానున్నది. నీవిప్పు డుద్రేకముచే నాతనినిఁ గొట్టుటకు ముందుగు వైచుసరికి నిన్ను నక్షత్రములలోని కెగురఁగొట్టింతునో లేదో నా చమత్కారము. అట్టి యాలోచనముమాత్ర మెప్పుడు చేయవలదుసుమా! నాస్థానమున నిల్చుటకు సాహసించిన యాతఁడెవఁ డనియంటివి కాదా! నీకున్నది మేనత్తకొడుకు స్థానమే కాదా? అది యిప్పుడుకూడ నుండనేయున్నది. అంతకంటె నీకు వేఱుస్థానము లేనేలేదే. లేనిది పోవుటయెట్లు? "సాహసించిన" యని యంటివి. ఆతనికి నీభయమేమి? అతనిమాట యటుండనీ. రత్నప్రభకు నీయందు భయముండవలసినపని యేమున్నది? ఆమె నీభార్య కాదే! కాపురముచేయుచు సాహసించిన భార్యలను భర్త లేమిచేయుచున్నారు. కనుచాటునఁ బ్రపంచము సుఖముగా దొరలిపోవునుగాని పరీక్షకుఁ బ్రపంచమాఁగఁగలదా? మనకుఁ గన్నులు తఱచుగా మూసికొనుట కీయఁబడినవి. కాని తెఱచుటకుఁగాదే చూచినచోఁ జెల్లఁ దప్పుండి తీఱినది. చూడకుండనున్నచోటమాత్రమే తప్పులేదు. అందుచే లేనిపోని ప్రయత్నములువలదు.

నా—అమ్మా! ఆతఁ డెవఁడో తెలిసికొనఁగోరి యడిగితిని.

ప—నీమేనమామ కూతుర కంతదగ్గఱవాఁ డెవఁడో నీకుఁ దెలియఁదగినది. ఆమెకుఁ దెలియఁదగినది. అంతేకాని నాకెట్లు తెలియును? ఆతఁడు మీతోవచ్చినవాఁడని నేననుకొనుచున్నాను.

నా—నాతో నెవ్వఁడురా లేదు. మీకోటలోనివాఁడేయని నేననుకొనుచున్నాను.

ప—మా కోటలో నిట్టివాఁడున్న యెడల డొక్కచీల్పించి రాలుకొట్టింపకుందునా? సరి. రత్నప్రభయే నీకుఁ దెలియకుండఁ దీసికొనివచ్చినదని యనుకొనవలయునని తోఁచుచున్నది.

మా—రత్నప్రభా! నీకు జాతకమున్నదా?

ర—ఉన్నదేమో నేనెఱుఁగను.

మా—నీచేయి చూపించెదవా?

ర—ఆఁ (కుడిచేయినిచ్చును.)

మా—అమ్మా! నీవు నాకు సోదరివి. నీకింకఁ బెండ్లికాకపోవుటచే నీ చేతిని స్పృశింతును. (చేయిచూచును.)

నా—(తనలో) ఆహాహా! నాకగ్ర్యమైన యామె దక్షిణకరము నే స్పృశించితివా? ఎంత కాలమునుండి యున్నయాశ యిట్టి వ్యర్థాచేసితివిరా తుచ్ఛుఁడా! కాని నీవామెను దక్కించుకొనునప్పటిమాటకదా! ఇంత నమ్మఁదగినయను బంధమే మాయమైనప్పుడు ప్రపంచమున నింక నమ్మదగినదేదైనానుండునా?

ప—నారాయణవర్మా! రత్నప్రభ కాతనికి స్నేహమున్నదని నీవిదివఱకు రవంత సందేహింపనైనలేదా?

నా—నాకు సందేహలేశమైన నున్నయెడల నేను బ్రధానమునకై యేల సిద్ధపడియుందును?

ప.—ప్రధానమున కభ్యంతరముండదులే. ఈతఁడెవఁడో యిచ్చటకు వచ్చి ప్రధానమునుగూర్చి నేను జేసికొన్నయేర్పాటునకు భంగమొనర్చుచున్నాఁడు. ఈతనిని నేను శిక్షింతును. ఆమెను నీవు క్షమింపుము. పెండ్లికాకుంటచే నామె మనస్సు పరిపరి

విధములఁ బ్రోచును. ఇట్టివారే పెండ్లియైనపిమ్మట మహాపతివ్రతలగుదురు. అందుచే—

ము—(రత్నప్రభ రెండవచేతినిగూడఁ జూచును.)

నా—నాకు రత్నప్రభ యక్కఱలేదు.

మ—ఎందుచేత? పట్టిపిల్లదియైన యామె వలపు నీయందునుండి తప్పినట్లు కనఁబడినంతమాత్రమున నీవల పామెనుండి తప్పిపోవునడల నీకు నామెకు భేదమే మున్నది? ఆమె తప్పుచేసినట్లు నీకుఁ దోఁచినపుడు దిద్దుబాటుచేసి మఱల్చుకొనుట బుద్ధిమంతుని లక్షణము కాదా? నీమీఁద లేక యామెకన్యునిమీఁద నేయున్నదని నిశ్చయపఱపుము- సముద్రమువంక వృధగఁ బోవుచున్ననది కట్టుకట్టఁగట్టి మనము దానిమహాఫలమందుచున్నామా లేదా? ఇంతకు మించినదేదియు లేదే? అందుచే నా మాటవినుము. అట్టె వెనుకకుజూడకు.

నా—(వెనుకకుఁజూచి) (తనలో) అయ్యయ్యో! ఈదుర్మార్గుఁడామె రెండుచేతు లొక్కసారి పట్టుకొనినాఁడే! అనునయించుచున్నాఁడు కాఁబోలు. అప్పళించుచున్నాఁడు కాఁబోలు. నన్నుఁ బూర్తిగాఁ జిత్తమునుండి బహిష్కరింపుమని ప్రార్థించుచున్నాఁడు కాఁబోలు.

ము—అమ్మా! నీకేమియుఁ గష్టములు లేవు. నీవు తలఁచుకొన్నభర్తతోడనే నీకు వివాహము త్వరలోనగును.

ర—నాయనా! నాభర్తమనస్సన్యాకాంతమైనదని నేనుస్పష్టముగా వింటిని. ఆతనితో నాకింకఁ గుదురదు. నాకు సన్యాసినీయోగమున్నదేమో పరిశీలించి చెప్పుము.

ము—పదుగురు పిల్లలఁగనఁదలఁచినయిల్లాలికి సన్యాసినీయోగమెట్లు చెప్పుదును? నీభర్తమనస్సన్యవనితావశము కాలేదు. కాదు.

ర—పొరపాటు పడుచున్నారు. అతఁడు-అతఁడు—

ము—నీయభిప్రాయము నాకు తెలిసినది. అది యసత్యము. అట్లుకాకుండ నేను బూటకాపుందును. నీకు సోదరులు లేరని వింటిని. నేనే సోదరుఁడను. నారాయణవర్మతో నిన్నుఁ గూర్చెడువాఁడను నేను. అతనిమనస్సు నీమీఁదనే యున్నది. అమ్మా! ఈ రెండుచేతులును దల్లిపాదములవలెఁ గన్నుల కద్దుకొందును.

నా—(తనలో) ఆమె రెండుచేతులను ముద్దిడుకొనుచున్నాఁడే? ఇఁక నేమున్నది? ఇఁకఁజూడదగినదేదియు లేదు. రత్నప్రభచావో యీచండాలునిచావో, నాచావో, యీమూఁడునో యిక్కడఁ ద్వరలో జరుగవలసియున్నది. పెండ్లియింకఁ గాలేదని యుపేక్షించుట బుద్ధిహీనత- గౌరవహీనత- మాతండ్రిసంకల్పించినప్పుడేయైనది- దానితండ్రి దానిని నాకీయఁదలఁచి తన యింటఁ బెట్టుకొన్నప్పుడే యైనది మేమొకరినొకరు రవంతజ్ఞానమురాఁగఁ జూచుకొనినప్పుడే యైనది ఇంతకాలమునుండి మేము ప్రక్కప్రక్క భార్యాభర్తలమై ప్రవర్తించుచున్నాము. ఈదుర్మార్గురాలు భర్తృద్రోహమాచరించినది. అందులకుఁ దగిన ఫలమొందవలసియున్నది.

ప—నారాయణవర్మా! తీవ్రముగఁ గ్రూరముగ నాలోచించుచున్నావేమి? నామాటవినుము. ఎవ్వరినిగూడ నేమియుఁ జేయఁగూడదు. అనఁగూడదు. నీవెవరిరాష్ట్రములో నున్నావో, యెవరియింటిలోనున్నావో బాగుగా యోజించుకొనుము. నీవుతీర్చవలసిన పగ నేనుదీర్తును. రత్నప్రభ నీకక్కఱలేదని స్పష్టముగాఁజెప్పితివి-నీపక్షమున నేనున్నాను. నీయిష్టమునకు వ్యతిరేకముగా నామెను గ్రహింపుమని నిన్ను నేను నిర్బంధింపను. నీకు మామగారిరాజ్యము పోవునని సందేహమక్కఱలేదు-

నా రాజ్యములో సగము, నాసర్వస్వములో సగము నీకిచ్చెదను. నిన్ను నాతో సమానప్రతిపత్తిగలవానిగఁ జేసెదను. వెనుకటి సంగతులేమియుఁ దలపెట్టుకొనకుము. ప్రాప్తిలేనివస్తువు చేయి దాటిపోక తప్పదు- పోయినదేదో శాశ్వతముగాఁ బోయినదే? ఇఁక ముందు రాఁదగినదేదో చూచుకొనవలయును. నీవేమియు నింక మాటలాడకుము. నిన్ను సింహాసనముమీఁదఁ గూరు చుండఁ బెట్టినిమొదల నేను జక్రవర్తినిగాను—నీకింక మామ గారు లేరు. అతనిరాజ్యము లేదు. రత్నప్రభ లేదు. నీకున్నది నేను. నాకున్నదినీవు- రత్నప్రభనీమెడలఁ జేసిన ద్రోహమున కుఁ బ్రతీకారముగా నేనంతయైన సంకల్పించుకొని యుంటిని. కర్తృత్వము నీకుం దేమియు నుంచుకొనవలదు అన్నిటికి నేను న్నాను. ఆపాపపుణ్యము లన్నియునావి. ఏమిమాటాడవు?

నా—మీ రేమంటిరో నేను వినలేదు. క్షమింపవలయును.

వ—(తనలో) ఇంత యేమ్చులో నా గాన మీతని చెవికెక్కదు. ఈ పాట మరియొకపుడు పాడవలయును_ రత్నప్రభకు నీతనికున్న పూర్వానురాగమును స్వార్థపరులతచే నేను జెడఁగొట్టితి నన్న సందేహ మీతనిమనస్సునకుఁ దగులకుండుటకై యిన్ని పాటులు పడవలసి వచ్చినది. ఇప్పుడే నేను దొందరపడఁగూడదు.

ర—నాభర్త నన్నేవలచియుండెనా? నా కాతనితో వివాహమగునా?

ము—మరియొకసారి చెప్పుచున్నాను. చక్రవర్తిని కెటులున్నను నాతనికిఁ జక్రవర్తినిపై లేదు. అతని కామెతోఁ బొసఁగదు. అందుకు మఱియొకఁడు సిద్ధపడియున్నాఁడు. నీకు నారాయణ వర్మ తప్పడు. నే నిటులంటినని చక్రవర్తిని కే మాత్రమును దెలియఁదగదు. తెలిసినదా?

ర—(తనలో) చక్రవర్తిని మరియొకలాగునఁ జెప్పిన దెందువలననో. ఇదంతయు నా కెందులకు? (ప్రకాశముగా) నా కింతయే

చాలును. మీ రమోఘవాక్సంపన్నులు గావున నిర్విచారముగ నుండెదను.

ము—సరే—నీవు నీభర్త నీదినమునఁ జూడవలదు.

ర—చిత్తము.

ము—సరే—నీ విఁకఁబొమ్ము. (ఇద్దఱు లేతురు.)

నా—(తనలో) ఇద్దఱు లేచినారు; కలసి యాగదిలోనికిఁ బోవుదురేమో? అట్లే పోవునెడల జీవములతోఁ దిరుగరాకుండఁ జేయవలయును. ఆతఁడు గదిలోనికిఁ బోవుచున్నాఁడు. ఈమె మరియొక వంకకుఁ బోవుచున్నది.

(రత్న, ముర, అట్లు చేయుదురు.)

ప—నారాయణవర్మా! వారు పోయినారు. వారిమాటలు మనకు వినఁబడినట్లే మనమాటలు వారికి వినఁబడవు. కాని వారు మనకుఁ గనఁబడినారు. మన మీచాటున నుంటచే మనము వారికిఁ గనఁబడము. ఇప్పటివఱ కేమియుఁ దొందర లేకుండ జరిగినది. ముందుగూడ నటులే జరుపుకొనవలయును. సరే మనము పోవుదము రమ్ము.

నా—నేను నాబసలోనికిఁ బోవుదును. త్వరలో నాకు సెలవొసఁగు నెడల నేయూరైనఁబోయి జీవింతును.

ప—నీసెలవునకుఁ దొందరయేమియు లేదు. నీకు నేను సెలవీయఁ దలఁచుకొనలేదు. ఇప్పటికి నీవే నాకు సెలవిమ్ము. నేనుబోయెదను.

(పద్మిని నిష్క్రమించును)

నా—ఈగదిలోఁ జేరిన పాపాత్ముని ముందుఁ జంపెదను. ఇప్పటికింక గడియరాత్రియైనఁ గాలేదు. నిశామధ్యసమయమున నిటకు ఖడ్గపాణినై వచ్చెదను. ఇప్పటికి బసకుఁబోవుదును.

(నారా! నిష్క్రమించును.)

ఇది చతుర్థాంకము.

---

# పద్మిని

## పంచమాంకము.



ప్రదేశము—మురళీమనోహరుని గది.

[ప్రవేశము—మురళీమనోహరుఁడు.]

ము—సర్వతంత్రస్వతంత్రురాలును సర్వాధికారసంపన్నయు నగు
నామె నెట్లుదక్కించుకొనఁగలనో? తెలియకున్నది. ఆమెచూ
పెంతసేపు నాతనియందే యున్నది. అతని జేరుట కడ్డువచ్చు
చున్నకొండలను భేదించుచున్నది. వనములను గాల్చుచున్నది.
నాకుఁగూడఁ జక్రవర్తినియందే చూపున్నది. ఆమెను జేరుటకు
నే నేమిచేయుచున్నాను? యోగివేషధారినై జపమాలత్రిప్పు
కొనుచు నామెయింటనే కూరుచుండియున్నాను. ఏమిచేయుట
కును దోఁపకుండనున్నది. ఎట్లుపోవుటకును దారి కానఁబడ
కుండ నున్నది. ఆమెకు నారాయణవర్మపై వలపు మితిమీఱి
పోవుచున్నది. అది చెడఁగొట్టుటకు నావశముకాకుండ నున్నది.
చెడఁగొట్టినయెడలమాత్ర మామె నన్నువలచు నెట్లు? చక్ర
వర్తిని యెట్టిచిక్కునఁబడికొట్టుకొనుచున్నదో నేను నట్టిచిక్కు
ననే పడి కొట్టుకొనుచున్నాను. ఆమె స్థానబలిమికలది కావున
నామె కృతార్థురాలు కావచ్చునేమో కాని నడుమునఁ గావి
గుడ్డయుఁ జేత నానవకాయబుఱ్ఱయుఁగల నే నేమిచేయఁ
గలను. కాని నేను నిర్వహింపఁగల ననుమొండిధైర్యముమా
త్రము మనస్సును వీడిపోలేదు. ధైర్యమే దైవకటాక్షమునకు

గుఱుతని నమ్మియున్నాను. ముందు రత్నప్రభతో నారాయణవర్మను గలుపుటకంటెఁ గర్తవ్యము లేదు. అది యెంత శీఘ్రముగ నగునో యంతమంచిది. నేను నాకార్య మెట్లునిర్వహించుకొనఁగలుగుదు నను యోజనతోడనే రేయుంబవళ్ళు నిద్రాహారములు లేకుండ దొరలించుచున్నాను. నడు మీడ్చుకొనిపోవుచున్నది. తల నొచ్చుచున్నది. రవంత విశ్రమింతును. నారాయణ నారాయణ. (పండుకొనును.)

[నారాయణవర్మ ప్రవేశించును.]

నా—ఒక్కఁడను. నా కెవ్వఁడును లేఁడు. ఏమైననేమి? ఈగదిలోఁ బ్రవేశించిన దుర్మార్గుని జంపుటకు నిశ్చయించుకొంటిని. గది తలుపులు తెఱచియేయున్నవి. అదిగో అక్కడ నిద్రించుచున్నాఁడు. అప్పుడు నేను జూచుచుండగనే యీగదిలోఁబ్రవేశించి నాడు. వాఁడే వీఁడనుట నిస్సందేహము. నిదురఁబోవుచున్న వానిని జంపుట కాతరత కాదా? మేలుకొనవచ్చువఱకు వేచియుందునా? ఇంకదగ్గఱగాఁ బోయిచూచెదను. ఆహా! ఇదేమి విరాగివలెనున్నాఁడే. తనభార్యయే తన కక్కఱకురానప్పుడు నాభార్య తన: కెందులకో? స్వభార్యాతిరస్కారము పరభార్యాస్వీకరణమునకా? ఆహా! మనుజప్రకృతి యెంతభ్రష్టమైపోయినది!

సతతదేశ భక్త్యుపన్యాసంబునోట
నజ్ఞజను లిచ్చుబహుధన మంతయింట
వలపలికరాగ్రమున యతీశ్వరుల యష్టి
సవ్యకగమున నీవిమోక్షణము కాదె?

చీ. ప్రపంచభ్రష్టశాకరీకు నా కెందులకు? నాబ్రదుకుకంటె భ్రష్టమైన దిఁకేమున్నది? నాభ్రష్టత కీపాంథపరివ్రాజకాధముఁడే

కారణము. వీనిని జంపవలయును. సంసారియగువాఁడు వ్యభిచరించి నప్పుడే వానిని జంపవలసియుండునుగదా! సన్యాసియై పరకాంతను దడవిన యీదొంగముండకొడుకును జంపుటకంటె శిక్షయేమున్నది? ఇట్టివానిని జంపుట లోకోపకారముకంటె భిన్నమా? (గదిలోఁ బ్రవేశించి నకిలించుచున్నాఁడు) నకిలించినను లేవకుండనున్నాఁడు. లే బైరాగీ లే.

ము—(లేచి) మీ రెవరయ్యా?

నా—నే నెవఁడనైన నీకేమి?

ము—న న్నెందులకుఁ బిలిచితిరి?

నా—ఇందులకు. (బాకుతోఁ బొడుచును. బాకు భుజమునకు గీచికొని పోవును)

ము—హరిహరీ! దుర్మార్గుఁడా బైరాగినిజంపవచ్చితివా? ఏదీ బాకు? (ప్రక్కక్రింద వెదకును)

[నేపథ్యమున]—రావే త్వరగ రావే. అల్లరి యగుచున్నది.

నా—అదేమి చక్రవర్తిని దాసితోఁ ద్వరగవచ్చుచున్నది.

[పద్మిని, మాలిని ప్రవేశింతురు.]

ప—ఆఁగుఁడు. అంతటితో నాఁగుఁడు. చక్రవర్తినికోట యనుకొంటివా? గుడిసెవేఁటుకొంప యనుకొంటివా? సన్యాసివర్యా! నీయంగిర క్తముతోఁదడసినది. వర్మా! నీ పతనిని బొడిచితివా?

నా—ఔనమ్మా! పొడిచితిని.

ప—ఏల?

నా—అతఁడు నాకు మహోపకార మొనర్చినాఁడు.

ప—(తనలో) ఈతఁడు మొదటరత్నప్రభను జంపునేమో నాపీనవద లునని యనుకొంటిని. ఆమెను జంపక యీనిర్భాగ్యుఁ డీతనిఁ బొడిచినాఁడు. నేను వచ్చులోపలనే కార్యము మించినది.

(ప్రకాశముగా) ఈసన్యాసి నీ కేమియపకార మొనర్చినాఁడు? (సన్యాసి బలహీనుఁడై కనులుమూయుచుఁ దలవ్రాల్చుచున్నాఁడు.) మాలినీ! ఆతనిఁ బట్టుకొని దీసికొనిపోయి మన శస్త్రవైద్యున కప్పఁజెప్పుము.

(మాలిని, మురళీమనోహరుఁడు నిష్క్రమింతురు.)

ప.—నారాయణవర్మా! నీ కింతతొందరయేల? ఆతని నేమియు నీవు చేయవలదని చెప్పలేదా? నాకోటలోనున్న యాతని శిక్షించుటకు నీ కెట్లధికారముకలిగినది?

నా.—నాభార్యను హరించుట కాతని కెట్లధికారము కలిగెనో యాతని శిక్షించుటకు నా కట్లధికారము కలిగినది. మీకోట యనుమాట సత్యమే కాని యాతని శిక్షించుటకు మీరు నా కధికార మిచ్చువఱకు కాఁగఁదగిన పరిస్థితి కాదు. కావున నేన ట్లొనర్చితిని. పరమాత్మయై మీరు నన్ను శిక్షించుసెడల మహాసంతోషము. చచ్చుట కింతకంటెఁ దగినసమయము నాకుండదు. కానిండు.

ప.—నీభార్య కాకస్మికముగఁ గలిగిన రవంత చిన్నతనపుదుర్బుద్ధిని మరలించి యామెను నీతోఁగూర్చి మిమ్మొకయింటివారుగ జేసి మీమామగారి రాజ్య మీయవలయునని నే నెంచి యుండు కొఱకుఁ బాట్లుపడుచుండగ దుడుకుదుడుకునఁ బోయి యాతనిఁ బొడిచి నీవు చచ్చుటకు సిద్ధపడెదవా? నీకు మతి యున్నదా లేదా?

నా.—చక్రవర్తినీ! మీరు నాకొఱ కింత శ్రమపడవలదు. ఇదివఱకుఁ బడినదానికే నేను కృతజ్ఞుఁడనై యున్నాను. ఆమె నా కక్కఱలేదు. అక్కఱలేదు. ఇంతకాలమును నమ్మించి నా కింత యపకార మొనర్చినదాని నింక—(తలవంకించుచున్నాఁడు.)

ప—తప్పే చేసినది. చేయులేదని నేనంటినా? అనుటకు నాకు నోరు వచ్చునా? తప్పుచేసినది కావుననే క్షమింపుమంటిని.

నా—చక్రవర్తినీ! క్షమింపుము. నమస్కరించుచున్నాను. ఆమె నా కక్క ఆలేదు.

ప—అక్క ఆలేదా?

నా—అక్క ఆలేదు.

ప—నా మొగము చూచి చెప్పుము. నిజముగా నక్క ఆలేదా? నా మొగము వంక జూడ వేమి?

నా—(చూచి) అక్క ఆలేదు.

ప—పోనీ! అక్క ఆలేని యెడల బలాత్కార మెవరు చేయుదురు? పోనీ నీయం దిష్టమున్న దానినే జేసికో. నీయందుఁ బంచప్రాణములు పెట్టుకొన్న దానినే చేసికో. మాట లాడ వేమి?

నా—నే నెవ్వరినిగూడఁ జేసికొనను.

ప—సన్యసింతువా? ఇదిగో చూచితివి కాదా? సన్యాసిసౌఖ్య మెట్లున్నదో? కాషాయాంబరధారివై కనబడినవారి నెల్లఁ దమ ముటకంటె గృహస్థాశ్రమముననే గుడుగుడుగుంచము లాడుటమంచిదికాదా? అహా! కాలకృత్యములను దీర్చుకొనుటకుఁ గాళికాలయమే గానివనికిరాదా? ఓహో! నీవుసన్యసించుట! సన్యాసినియమమును నిర్వహించుట! అడుగనక్క ఆలేదు? అంటఁగూడని మేనమామకూతురై మురిసిమురిసి కాళ్లఁ జేతుల నెగదిగఁ బ్రాకులాడి పాకులాడి తోటకూరయాకులోని పురుగును వలె నాపె నిన్నంటుకుండ దులిపివైచి నింతగా మొత్తుకొని మొత్తుకొని యాకస్మికముగ సర్వసంగపరిత్యాగివై సన్యాసి వయ్యెదవా? సిగ్గక్క ఆలేదా? పూర్వోత్తరసందర్భమక్క ఆలేదా? మామకూఁతురు నీకంటిలో మట్టిఁగొట్టి నీమొదుటనే పైవా

ని ప్రక్కఁ జేరి నీత్రాఁడు త్రెంపగ నీవు జన్నిదములఁ ద్రెంపు
కొని సన్యసింతువా? ఒక్క వెకిలినవ్వు వెంబరగొట్టుడాఁడుది
నిన్నుఁ బరాభవించి నీకొంపతీసి నీగొంతుకోసి నీబ్రతుకు వల్ల
కాడు చేయుటకు సమర్థురాలైనప్పుడు నీవెంతవాఁడవో?
ఇదిగో నేను జేసిన దాసరయ్య వీఁడే యని నిన్నుఁ దన ప్రి
యునకుఁ జూపి కిలకిలనవ్వి కెవ్వుననార్చుటకు దాని కవకాశ
మీయవచ్చునా? ఇట్టిసమయమున మనస్సు బింకపఱచుకొని
దాని నెత్తిమీద నెగిరిపోవుదానిని గట్టికొన్నయెడల దాని
మొగముమీఁదఁ జెప్పునఁగొట్టినట్లుండునే. స్వతంత్రుఁడవైన
నీవు బేలపడి డీలుపడి గోలుమనెద వెందులకు? త్రొక్కు
మరియొకదారిత్రొక్కు. బుద్ధిమంతుడవుకావా? నీయదృష్ట
మునకు నీవే కర్తవు. నీవు చక్రవర్తివగుట నీచేతిలో నున్నది.
మహావకాశము నీపుణ్యమున సిద్ధించినది. ఇది దాఁటిపోనీకు.
పోనిచ్చినయెడల బ్రతు కంతయు నధ్వాన్నమే. అవమానమే.
అపాయకరమే. నీవు త్రాసుముంటిపై నున్నావు. ఇటుజోగిన
పరమసుఖమైన బ్రదుకు. అటుజోగిన భయంకరమైన చావు.
యోజించుకో!

వా—నన్నుఁ జంపుదునని మీరు బెదరింప నక్కఱలేదు. చావునకు నేను సిద్ధముగనే యున్నాను. నేనెవ్వనిఁ గూడ వరింపను. వ రింపలేను.

ప—తిరిగి యెవతెనైన వరింపకుండుట నీతియనుకొన్నావు కాఁబోలు. ఇంత నీతిమంతుఁడనని యనుకొనుచుంటివికదా! నీనీతి యంతయు గోఁతిలోఁ బడునట్లు సన్యాసి నేలచంపఁదలచితివి?

వా—నేను సంకల్పించుకొన్న మహాసుఖమంతయు నొక్కసారి కూలి పోవఁగ దాత్కాలికోన్మాద మెత్తి యట్లు చేసియుందును.

వ—పిచ్చిచేఁ జేసితివని చెప్పినవానికిఁ బిచ్చియెక్కడిది?

నా—అమ్మా! ఎందుల కీమాటలు ?

వ—ఆఁ ఆఁ నాతో మాటలాడుటయే నీకంత రోఁతగా నున్నదా ? సరే. ఎవ రక్కడ ?

[నేపథ్యమున] చిత్తము.

నీవు పోయి కారాధిపతి నిటకుఁ దీసికొనిరమ్ము.

[నేపథ్యమున] చిత్తము.

వ—వర్మా! నీవు చక్రవర్తిని కవిధేయుఁడుగఁ బ్రవర్తించితివని యెఱుఁగుదువా ?

నా—ఎఱుఁగుదును.

వ—చక్రవర్తినియెడల ద్రోహ మొనర్చితివని యెఱుఁగుదువా ?

నా—నేను మీయెడల ద్రోహినిగాను.

వ—నాయతిథివైన నీవొక సన్యాసితోఁ గుట్రచేసి నన్నుఁ జంపనెంచితివి కాదా ? అతఁ డంగుల కంగీకరింపకపోవుటచేతనే కాదా నీ వాతనిఁ జంపఁబూనితివి ?

నా—హరిహరీ! ఇదియొక్క క్రొత్తకల్పనయా ? నన్నుఁ జంపుటయే మీ యభీష్టమగునెడల నటులే కానిండు. నరహత్యదోషము నకు మరణదండనమున్నదే కదా ? రాజద్రోహ నేరముకూడ నాపైఁ గట్టుటెందుల కమ్మా-మీరెంత గొప్పవారైనను నన్ను రెండుమారులు చంపఁగలరా ?

వ—నీ బాకుపోటువలన సన్యాసి చావకుండునెడల ?

(కారాధిపతి ప్రవేశించును.)

కారాధిపతీ! ఈతఁడు నరఘాతుకుఁడు- రాజద్రోహి- ఈతని నురిశిక్షనొందువారి కొట్టులో నుంపుము.

కా—చిత్తము.

(నారాయణవర్మతోఁ గారాధిపతి నిష్క్రమించును.)

ప—ఛీ! నపుంసకుఁడా! సిగ్గుమాలినవాఁడుకా! రాతిబొమ్మా! నీబ్రదుకు మండిపోను. నీకు పురుషజన్మమిచ్చిన బ్రహ్మగాని నీదాడ నాదాడ వాయింపవలసినదిరా! ఆఁడుదాననుఁ అందుపైఁ బసుచుదానను- అందుపై సౌందర్యవతిని. దానిపైని జకవ్రర్తినిని. మగఁడో మగఁడోయని యీ మీసాలముత్తయిదువుకై దేవులాడుగతి కలిగినదే! ఎన్ని యిచ్ఛకములాడినను నెన్ని మోసములు పన్నినను నెన్ని తర్జనభర్జనము లొనర్చినను నీయుంచుగడ్డముండకొడుకు కరిగినాఁడు కాఁడే! ఎంతబట్టబయలై పాడైపోయితిని! ఇప్పుడేమిచేయవలసినది. తెలివితక్కువమైన యీఁడుదిప్పుడేమ్చును. నే నట్టులేడ్వను- కాని నామాయరాజ్యము తయూ వ్యాపింపకుండ నే చప్పున నెవ్వనినైనఁ బెండ్లి చేసికొందును. నేనీసారిమగనికొఱకుఁ బ్రయత్నింపను. ప్రిప్రథమమున నెవఁడు నన్నువరించి యడుగునో మారుమాట చెప్పకుండ నాతనిని బెండ్లి చేసికొందును. వాఁ డెవఁడైననరే నాయందు గాఢానురాగమున్న వాఁడైనఁ జాలును. మాలినీ- త్వరగ వచ్చుచుంటి వేల?

[మాలిని ప్రవేశించును.]

మా—అమ్మా! సన్యాసి బ్రదుకుట దుర్ఘటమని వైద్యుఁడు చెప్పినాఁడు.

ప—ఆఁ ఆఁ! అదేమే-చచ్చిపోవునటే. అయ్యయ్యో! మహావ్యక్తియే.

మా—మరణమునకు మహావ్యక్తియేమమ్మా! మాపిన్నమ్మ చచ్చిపోలేదా అమ్మా!

ప—నీపిన్నమ్మ మహావ్యక్తియా? నీపిన్నమ్మయంత పనికిమాలిన ముండ ప్రపంచమున నున్నదా? మగనిని గడతేర్చినది. కన్న కొడుకునకు విషముపెట్టినది. నీమగనితోఁ గాపురము చెడఁ గొట్టుటకుఁ బ్రయత్నించినది. ఇదికాక—

మా—ఇట్టి కాపురములు చెడఁగొట్టుట కీకలికాలములో నెందఱు ప్రయత్నించుటలేదమ్మా! అక్కఅవచ్చినప్పు డంద ఱన్నియా ట లాడినవారే.

ప—(తనలో) దీనిగొంతుగోయ! గుండెలలో బాకుపోటుగఁ బొడిచి నది! మోసకత్తెయైన రాణిని దాసిగూడ నీసడించునుగదా! పోనీ! ఎంత మోసముచేసినన్నైన నింతయైన ఫలించినదా? మోసము చేసితినన్న యపకీర్తియే మిగిలెను గాని యంత కంటెఫలమేమియు లేకపోయెనే? ఫలములేదుసరికదా! పైగఁ బైవారిచేత నందులోఁ బడునుకొని బ్రదుకుముండలచేతఁగూ డఁ దిట్లా. నేను రత్నప్రభానారాయణవర్మలయెడల మహా ద్రోహ మొనర్చితిని. నారాయణవర్మ సన్యాసిని బొడుచుట లోఁ దప్పేమున్నది? యథార్థ మాలోచింపగ సన్యాసినిబొడి చినది నేనుగాని నారాయణవర్మ కాఁడే! సన్యాసి చచ్చునెడల నరహత్య నాదికాని నారాయణవర్మదికాదే! ఇందులకు నారా యణవర్మ కురిశిక్ష యెందులకు? ఆనరహత్యకూడ నానెత్తిని గట్టుకొనుటకేనా? పండువంటి రత్నప్రభకాపురము పరశు రామ ప్రీతియైనదికదా! ఎన్నియేడ్పులేడ్చినను నాకు మగఁడు లభింపలేదుగదా! ఇంటి కతిథియైవచ్చిన సన్యాసి నామూల మునఁ జచ్చుటకు సిద్ధముగ నున్నాఁడుకదా! ఇంత సంసార ఘాతుకత, యింత జీవనాశనము నేను జేసిన మోసమునకేనా ఫలము! ఏకష్టమువచ్చినను సహించుకొనుటకుఁబ్రయత్నింతు

నుగాని యింక నెవ్వరిని గష్టపెట్టను. బుద్ధివచ్చినది. (ప్రకాశము
గా) నీవేమంటివో నేను వినలేదుకాని, సన్యాసి బ్రదుకఁడని
యే వైద్యుఁడుచెప్పెనా?

మా—ఔనమ్మా.

ప—అయ్యయ్యో! ఆతఁడెవరో- ఎక్కడఁబుట్టినాఁడో- తలిదండ్రు
లెవరో- ఎక్కడఁ బెరిగినాఁడో- యెక్కడవిద్య నేర్చినాఁడో-
ఎక్కడ నాతనిబంధులు మిత్రులున్నారో. అయ్యయ్యో తుద
కు మనకోటలోఁ జచ్చిపోవునఁటే!

మా—కోటయావలి కీడ్చివేయుమని సెలవా అమ్మా!

ప—ఛీ! నోరుమూసికో! నేనంతదుర్మార్గురాలనని నీయభిప్రాయమా?
నేనంత పాషాణహృదయనని నీయభిప్రాయమా? నేనంత
పాపాత్మురాలనని నీయభిప్రాయమా! మంచిచెడ్డల గురెఱుఁ
గకుండ మాటలాడెదవా? నే నాతని నడువీధిలోఁ బాఱవేయు
మందునా? నేనాతనియం దెంతో గౌరవము భక్తియుఁ గలిగి
యుండునని నీవెఱుఁగవా? ఆతనియందేమో యవి యకారణ
ముగ వృద్ధియగుచున్నవని నేను నీతో నిదివఱకుఁ జెప్పియుం
డలేదా? అసందర్భప్రలాపినీ! పో- ఆవలికిఁ బో.

(మాలిని పోఁబోవును.)

ఏమే- ఆతఁడు బ్రదుకఁడన్నమాటలు చెప్పుటకేనా వచ్చితివి?
అంతకంటెఁ జెప్పవలసినమాట లేవియు లేవా?

మా—లేకేమమ్మా?

ప—ఆమాటలు చెప్పకుండఁ బోయెదవేమి?

మా—చెప్పుటకే వచ్చితినమ్మా- చెప్పనిచ్చినయెడలఁ జెప్పకుం
దునా?

ప—నీయంతనీవే యిటకు వచ్చితివా? నిన్ను వైద్యుఁడు పంపగవచ్చితివా?

మా—అమ్మా! సన్యాసి పంపగవచ్చినాను.

ప—అతఁ డేమనెనో త్వరగఁ జెప్పుము.

మా—ప్రాణావసానసమయమున మీతోఁ గొన్నిమాటలు చెప్ప వలయునఁట- మిమ్ముఁ దనయొద్దకు రమ్మని కోరినాఁడు.

ప—నేను రావలయుననియే యనుకొనుచున్నాను. వచ్చుచున్నానని నీవు ముందుగఁ బోయి చెప్పుము. కాలుసేతులు కడిగించికొని పట్టుబట్టలు కట్టుకొని భగవంతుని దర్శనమునకు వచ్చునట్లు వచ్చెదనని చెప్పుము. పొమ్ము.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)



# పద్మిని

## షష్ఠాంకము.

---

ప్రదేశము: కోటలో నొకగది.

[ప్రవేశము: రోగశయ్యపై మురళీమనోహరుఁడు, మాలిని ప్రవేశింతురు.]

ముర—ఇంకను రాలేదేమి?

మా—ఇంకను రాలేదేమని యెన్నిసారులడిగితివయ్యా! ఇంత తొందరపడుదు వేల?

ము—తొందర కాక నాకు శాంతి యెట్లువచ్చును? నేను గోటఁ జేరినది మొదలు కోట కగ్గోలుగానున్నది. నామనస్సంతకంటె కగ్గోలుగానున్నది. రత్నప్రభ మనస్సన్యాక్రాంత మైనదని నారాయణవర్మతోఁ జెప్పి నారాయణవర్మమనస్సన్యాక్రాంత మైనదని రత్నప్రభతోఁ జెప్పి వారిద్దఱకుఁ జెడఁగొట్టినదికదా! రత్నప్రభయవస్థఁ జూడ నాకు మిక్కిలి జాలియగుచున్నది. నేను దనకేదో మహోపకార మొనర్చితినని నారాయణవర్మ స్పష్టముగఁ బలుకనే పలికినాఁడుగదా! ఈయుపకార మేమున్నది? నేను రత్నప్రభను వశపఱచుకొంటినని యాతనికిఁ బద్మిని నచ్చఁజెప్పకపోయినయెడల నాతోఁ డక్కులపలుకును? నన్నేలపొడుచును? రత్నప్రభ బ్రదుకా చెడినది. నారాయణవర్మ బ్రదుకా చెడినది. మరణదండన మొందువారికొట్టులో నారాయణవర్మ పెట్టఁబడినాఁడని వినియేయున్నాము. ఆతని

నామె చంపునేమో! అతఁడు చచ్చునెడల రత్నపరీక్ష చచ్చును. ఈతంత్రమున బుద్ధిపూర్వకముగ నేమూఁనో చిక్కుకొనియున్న నా కీమహాపాతకములో భాగము రాకతప్పదు. అదిగాక చక్రవర్తిని నట్టి పాపమునుండి తొలగించుట మన విధి. ఏమి మాలినీ.

మా—ఔనయ్యా కాదన్నవా రెవ్వరు? కాని యీమాటలన్నియు నిదివఱకుఁ బదిసారులైన నకుకొన్న వేకదా? తిరుగనెందులకు?

ము—నరే కాని పద్మిని మొగమును బాగుగాఁ బరిశీలించితివి కాదా?

మా—ఆ.

ము—ఆమెకు రవంత పశ్చాత్తాపము కలిగినట్లు కనఁబడినదా?

మా—కలిగినట్లే నాకుఁ దోఁచినది.

ము—నీకుఁ దోఁచుటయే నాకుఁ జాలును. పశ్చాత్తాపమే కలిగిన యెడల నా పవిత్రదంపతు లిద్దఱు బ్రదికినవారే- నా పుణ్యవశమున నేను నొక యింటివాఁడను గావచ్చును. నేను బ్రదుకననియే స్పష్టముగాఁ జెప్పితివి కాదా? నీ యభిప్రాయ మదియైనట్లు చెప్పితివా? వైద్యుని యభిప్రాయ మైనట్లు చెప్పితివా?

మా—నాయభిప్రాయమైనట్లు చెప్పినయెడల లక్ష్యము చేయదేమో యని వైద్యుని యభిప్రాయమనియే చెప్పితిని.

ము—మాలినీ! వైద్యుని బిలిపించి పద్మిని యడుగునెడల "నేమియు భయములేదు. ఆతఁడు బ్రతుకునని వైద్యుఁడు చెప్పునుగదా? అందుపై నామె యిచ్చుటకు రాదేమో?

మా—నే నంతస్పష్టముగాఁ జెప్పినప్పుడు వైద్య నేల పిలిపించును? మిమ్ముఁ జూచుటకు రావలయునని తొందరపడుచునే యున్నది. అదిగాక పట్టుబట్టలు కట్టుకొని భగవంతుని జూచుటకు వచ్చి

నట్లు వత్తునని చెప్పుమని కూడఁ జెప్పెనని చెప్పలేదా ? లేని పోని నాదేహము లివన్నియు నేల ?

ము—ప్రయత్నకాల మందెంత ధైర్యమున్నను ఫలకాలమందు సందేహము మెండుగనుండుట నరుని ప్రకృతి కాదా ?

(పద్మిని ప్రవేశించును.)

ప—మహాత్మా ! నమస్కారములు.

ము—నీ కతిశీఘ్రముగఁ గల్యాణము కావలయునని దీవించుచున్నాను.

ప—నా కల్యాణము మాటకేమి? మీరు బ్రదికియుండుటకంటె నాకు వేఱు కల్యాణమున్నదా ? మాలినీ ! నీవు వైద్యునింటికిఁ బోయి యాతనిఁ దీసికొనిరా.

మా—చిత్తము.

(నిష్క్రమించును.)

ప—సన్యాసివర్యా ! నేను మహాపాపాత్మురాలనైతిని. నాకు మీ యొద్ద దాఁపఱికము లేదు. స్పష్టముగ మీతో నాపాపములను జెప్పి మీ యవసానకాలమున క్షమాపణతోడి మీ యాశీర్వాదము నొంది పరిపరి విధములఁ బాడైన మనస్సును బాగు చేసికొన వచ్చితిని.

ము—నీవు చెప్పవలసిన యంశము లేవో నిస్సంశయముగఁ జెప్ప వచ్చును.

ప—అవసానసమయమున నాతండ్రి నాకు భర్తను స్థిరపఱిచినాఁడు. ఆతని నేను జూడలేదు. నా కాతనియం దిష్టము లేదని గ్రహించి యాతనికి మూఁతివంకర యని ముక్కువంకర యని చూచివచ్చినదాసులు చెప్పగా దాసిదానికంటికే యాఁగనివాఁడు నాకంటి కెట్లాఁగునని నే నతనిని దలపెట్టుటకూడ మానివైచితిని. ఒక్క మాలినిమాత్ర మాతనిఁ గూర్చి యనుకూలముగఁ జెప్పు

చుండెడిది ? అందుచేత దానిపై నాకుఁ గోపము. నాతండ్రి కిట్లు నేనవిధేయురాలనైతిని. ఇది నాప్రథమదోషము. నారాయణవర్మను నేను గాటముగా వలచితిని. ఆతని జేసికోఁదలఁచి రత్నప్రభతో మాయమాటలు చెప్పి యామె కాతనియందు రోఁతను గలిగించితిని. నారాయణవర్మతోఁ గూడ నట్టే చెప్పి, యతనికి దానియం దసహ్యతను గలిగించితిని. సన్యాసివర్యా! రత్నప్రభకు నీకు సంబంధమున్నదని నారాయణవర్మతోఁ జెప్పితిని. సంధ్యాసమయమున నీ గదియొద్దకుఁ దన భవిష్యత్తును దెలిసికొనుటకై పోవునట్లు ప్రోత్సహించినది నేనే. నీ వామె చేయిపట్టుకొని చూచి, మాటలాడుచుండగా, నేను నారాయణవర్మకు మిమ్మిద్దఱను జూపితిని. అతఁ డప్పుడే తీవ్రపడెను కాని నే నాఁపితిని. ఆరాత్రియే యాతఁడు నిన్ను రత్నప్రభనుగూడఁ జంపునని యెంచితిని. ఆమె నాతఁడు చంపుట నా కిష్టమే. ఆమె యారీతిగ నాదారినుండి తొలఁగింపఁబడినప్పుడు నన్నాతఁడు వివాహముచేసికొను ననునాశ నాకప్పటి కుండెను. కాని యాతఁడు నిన్ను జంపుట నా కెంత మాత్రము సమ్మతికాదు. నీకేమి యాపదకలుగునో యని యూఁదోళనపడుచు నీ గదియొద్దకు వచ్చితిని. నేనొక్కనిముస మాలస్యముగా వచ్చుటచేత, నీకుఁ గాఁదగనిపని నేఁ దో యది యైనది. ఈనరహత్యదోషము నాతలపై నున్నది.

ము—నారాయణవర్మను, రత్నప్రభను నింకనైన సుఖముగనుండ నిచ్చెదవా ?

వ—నారాయణవర్మమాట నేనెట్లు చెప్పఁగలను ? నీవు మరణించునెడల నాతని కురిశిక్ష విధింపవలసి వచ్చునుగాదా ?

ము—నా హత్యదోషము నీతలపై నున్నదని చెప్పినప్పు డాతనికి శిక్ష యేల ?

ప—నేను బ్రత్యుత్తరము చెప్పలేని ప్రశ్నమడుగుట నీకు ధర్మమా? చూడుము నీతో మఱియొక ముఖ్యమైనమాట చెప్పవలసి యున్నది. నేను మోసములన్నియు వదలుకొంటిని. ఇఁక నెన్నడును మోసముచేయనని శపథ మొనర్చుకొంటిని. నా మోసమువలనఁ జెడినవారిని రక్షింపనిశ్చయించుకొంటిని. నీమన స్సునంతుష్టి నొందినదా ?

ము—ఆ- మహాసంతోషము- నీవు నారాయణవర్మను రత్నప్రభను సుఖపెట్టఁగలవు కాని, నీ మోసముచేఁ జెడిన నన్నెట్లు సుఖ పెట్టఁగలవు ?

ప—అందులకు నేనేమి చేయఁగలను? ఈవిచారము నాహృదయము ను దహించుచునే యున్నది. నిన్ను బ్రదికించువా డెవఁడైన నున్నయెడల నారాజ్యమూతని కిచ్చెదను. నీవు బ్రదుకవల యునని భగవంతుని బ్రార్థించియే యిటకు వచ్చితిని.

ము—నేను బ్రదుకుట యెందులకు ?

ప—నేను బ్రదుకుటకొఱకు.

ము—(తనలో) ఆహా ! ఎట్టి మహావాక్యము వింటిని. (ప్రకా) నీదయ వలన బ్రదుకవలయును గాని యితర సాధనమేమియు నాకు లేదు. నీమూలమున నిట్టిదశకు రావలసి వచ్చిన నాయవసాన వాంఛ నీవు వినవలదా ?

ప—అయ్యయ్యో ! నాదయ పరిపూర్ణముగా నున్నది. నీ కోరిక తీర్చుటకంటె నాకుఁ గావలసినదేది? నేనేమి చేయఁగలనో చెప్పుము.

ము—చేయఁగలిగినది చేయుదువా ?

వ—సందేహమేమి ?

ము—నన్నుఁ బెండ్లాడుము.

వ—(తెల్లఁబోయి) అయ్యయ్యో ! సన్యాసిని బెండ్లియాడుట యెట్లు?

ము—ఎట్లో తరువాతఁ జెప్పెదను. నీ కిష్టమున్నదా ?

వ—ఇష్టమున్నదే యనుకో- సన్యాసికి వివాహాధికార మెక్కడ నున్నదో ముందు చెప్పవేమి ?

ము—రేపో యెల్లుండియో మరణింతునేమో అట్లైన నీకు మహా కష్టము సంభవించును గదా ?

వ—దాని కేమి ? నా కట్టిగతియున్నఁ దప్పునా ? నేను దప్పించుకొనఁ గలనా ? ఒకఁడు తప్పింపఁగలఁడా ? కాని ముం దిది చెప్ప వేమి ? సన్యాసికిఁ బెండ్లియాడుట కధికార మెక్కడిది ?

ము—సన్యాసికి లేక పోవచ్చును.

వ—ఆ ! నీవు సన్యాసివి కావా ?

ము—కాకపోవుటఁ బట్టియే యట్లు కోరితిని.

వ—సన్యాసిరూపమునను న్న నీవు సన్యాసివే కావా ?

ము—కిరీటాంగదధారియైన నటుఁడు నలుఁడగునా ? నవరాలగడ్డము చెవులకుఁ దగిలించికొనిన పాత్రధారి పారాశర్యమౌని యగునా ?

వ—అలాగా సన్యాసివేషధారివై నీ వెందులకు వచ్చితివి ?

ము—ఎందులకా ? ఎందులకా ? నీకొఱకు; నాకన్నులకుఁ జంద్రికళ యైన నీకొఱకు- నాప్రాణమునకుఁ బ్రాణమైన నీకొఱకు- నామనస్సున కధిష్ఠాన దేవతయైన నీకొఱకు ఇట్టి నీకొఱకు- ఇంతకంటె నెక్కువయైన నీకొఱకు—

వ—ఇఁకఁ జాలునయ్యా! నీ వెవఁడవు?

ము—నే నెవఁడనా? నీదర్శన మెటు లబ్బునోయని రేయుంబవళ్ళు తపించినవాఁడను- నీమూర్తినే పూజించుచు సేవించుచు ధ్యానించుచు దినములఁ దొరలించుచున్నవాఁడను. నాకోరిక నెరవేఱదుగదా యను చింతచేత రెండుమారులు ప్రాణత్యాగమునకు సిద్ధపడియు నిట్టి మహానందానుభవమునకై బ్రదికియున్నవాఁడను.

ప—ఈ మాటలన్నియుఁ జెప్పుమని నేనంటినా? మీరు బ్రాహ్మణులా- క్షత్రియులా? మీతలిదండ్రు లెవ్వరు? మీచరిత్ర రవంత చెప్పుమని నే ననఁగ నీగొడవయంతయు నెందులకు?

ము—నేను క్షత్రియుఁడను. మీ సామంతరాజపుత్త్రుఁడను.

ప—ఆఁ అటులా! (ప్రక్క మొగముచేసికొని వెనుకకుఁబోవును.)

ము—సిగ్గుపడనక్కఱలేదు. నేను గ్రొత్తవాఁడనుగాను. మన మిఁక నెప్పుడో దంపతులము కానక్కఱలేదు. మీతండ్రిగారు తన యవసానకాలమున మనల భార్యాభర్తలఁగఁ గూర్చియే కైలాసమున కేగినారు. ఆయనయాత్మశాంతికొఱకు మన మింతటినుండి భర్తృభార్యాధర్మమును నిర్వహించుకొనుటయే యవశిష్టము.

ప—నీ విట్లు వేషధారివై వచ్చి నన్ను మోసగింతువా?

ము—పద్మినీ! మోసనుమాట నింకఁ దలపెట్టకుము- నీమోసము కంటె నామోస మెక్కువది కాదు. నామోసము ఫలించినది. నీది ఫలింపలేదు. దైవకటాక్షముచే నామోసము ఫలించిన దనుచున్నాను. కాని నాప్రయోజకత్వముచే ఫలించినదని యెన్న దనువాఁడనుగాను. మనము దేవుని దాసులము. మనము భార్యాభర్తల మగుట దేవునియాజ్ఞ- ఆయాజ్ఞయే మీ తండ్రి

గారి ముఖమునుండి వెడలినది. ఆయాజ్ఞ చెల్లించుట కదను వచ్చినది.

వ—(తనలో) అయ్యయ్యో! నేను నారాయణవర్మను గట్టుకొనుట కుఁ బడినపాటులన్నియు నాభర్తకానున్న యీతనికి నేనే చెప్పితినే. ఎంతబుద్ధిహీనురాలనైతిని. నాకింక నాతనియందే దృష్టియుండునని యీతఁడు నాయెడలఁ దప్పుటూహము కలిగియుండునేమో? నా కీతనితోఁ గాపురము సరిపడునో లేదో. మోస మొనర్చి యెంత యాశాభంగమునకు నగుబాటునకు నవిశ్వాసమునకుఁ బాపమునకుఁ బాలైతినో. నాకర్మము. ఇతనిని జేసికొమ్మనియే దేవుని యాజ్ఞమైనప్పు డేమిచేయఁ గలను? మొట్టమొదట నన్నుఁ గోరినవానిని జేసికొందునని శపథమొనర్చితిని. ఇఁక నాలోచనము సందేహము నేల? తిరుగుబాటేల? దేవునిశక్తి యెట్టిదప్పుకొనిపోవునో- యట్లుపోవును. పోకతప్పునా? ఇదిగో చేసిన ప్రయత్న మిన్నివిధములభగ్నమైనది. ఇన్నికొందలు తీయుటకు సిద్ధమైనది. ఇందఱు ప్రాణముల కపాయదశ తెచ్చినది ఇంతపాపమునకు హేతువైనది. వచ్చినంతదెబ్బ తలకుఁ దగిలినది. బుద్ధి పూర్తిగ వచ్చినది.

ము—నీ వెంతమాత్రమును సందేహింపకుము. వడుకుపిల్లలగు మగ వారికేమి యాఁడువారికేమి వివాహకాలము వచ్చునప్పుడు వారిని జేసికొనవలయుననియు, వీరిని జేసికొనవలయుననియు నూహము లందఱకుఁ గలుగును. అది సహజము- దానికై నీవు చింతింపవలదు.

వ—ఆమాట లింక నక్కఱలేదు. నీవు బ్రదుకుట దుర్ఘటమని వైద్యుఁడు చెప్పెనా?

ము—చెప్పలేను. నిన్నఁ జామటకు నేనే యట్లసత్యవార్తను మాలినిచే నీకుఁ బంపితిని. బాకు మొనగేఁచికొని పోయినది కాని యెంతమాత్రము భయములేదు. ఇదిగో చూడుము.

మా—(ప్రవేశించి) వైద్యుఁ డెక్కడ వెదకినను గానఁబడలేదు.

ప—మాలినీ! వచ్చితివా- వైద్యుఁ డక్కఱలేదు. (అప) ఇతఁడు దొంగసన్యాసి- మురళీమనోహరుఁడు. నాతండ్రి నాకేర్పఱచిన పెండ్లికొడు కితఁడే నఁటే.

మా—(అప) ఆలాగా! అమ్మా! పెద్దరాజుగారు సంకల్పసిద్ధులు.

ప—(అప) చక్కనివాఁడు కాఁడని యెక్కడవంకరయని యిక్కడ వంకరయని యెవరో చెప్పినారు కాదఁటే. నిక్షేపములాగునఁ నున్నాఁడు. నీకు గూడఁ జక్కఁగఁ గానఁబడుచున్నాఁడు కాఁడఁటే.

మా—(అప) నాకుఁ గనఁబడుట యెందులకు? మీ రీతని జేసికొనుట కంగీకరించినారా అమ్మా!

ప—నా యంగీకారమేమిటే. భగవంతుని యాజ్ఞయే. అదిగాక తండ్రిగారిమాటకు విరుద్ధముగ నడచుట తప్పుకాదఁటే.

మా—(అప) ఎవరియాజ్ఞయైనను బ్రాణములమీఁదికి వచ్చినవానిని జేసికొనుట తగునా?

ప—(అప) ఆసంగతికూడఁ గనుగొంటిని. అదియు దొంగమాటయే నఁటే!

మా—(అప) ఆలాగా! అమ్మా! ఇఁకఁ గావలసినదేమి?

ప—(అప) కావలసినది లేకేమి? మావలె నారాయణవర్మయు రత్నప్రభయు దంపతులై సుఖించినఁ గాని నాకు సంతోషముండునా? సంతోషము మాటయటుంపుము పాపవిముక్తి

యుండునా ? వారిద్ద ఱొకరినొకరు చంపుకొను నంతవైర
ముతో నున్నారు. ఏమి చేయవలయును.

మా—(అప) అమ్మా ! వారితో మీరే మాటలాడవలయును.

ప—(అప) నేను వారియెదుటఁ, జేసిన ద్రోహమొప్పుకొనుటకు
నాకుఁ జిన్నతనముగ నుండునే ! అదిగాక పరపురుషునితో నేను
మాటలాడుదునఁటే.

మా—(అప) అటులైన సన్యాసిచేఁ జెప్పింపవలయును.

ప—(అప) సన్యాసియందు వేమి ? తప్పుగాదా ? సంసారియే—చక్రి
వర్తియే—నీవే నాభర్తతో మాటలాడుము. నా కతనితో నీ
యెదుట మాటలాడుట సిగ్గుగా నున్నదే.

మా—(అప) నేన ద్వారగఁ బోవలసినదని నీ యభిప్రాయమా
అమ్మా.

ప—(అప) ఛీ ! ఆఁగుము నేనుగూడ నిప్పుడే వచ్చెదను.

మా—అయ్యా ! రత్నప్రభకు నారాయణవర్మకు దురదృష్టమువలనఁ
గలిగిన యభిప్రాయభేదములను సరిచేయుమని చక్రివర్తిని
మీతో సెలవిమ్మనినారు.

ప—నీ మొగము చక్రివర్తినియందు వేమి ? సెలవిమ్మనినారేమి ?
గొప్పవారితో విధేయతగ మాటలాడుట యెఱుఁగవా ?

ము—అదియేమియుఁ దప్పు చెప్పలేదు. నే నెప్పటికిఁ గూడ మీకు
సామంతరాజునే. మీయాజ్ఞ శిరమునధరింపవలసినవాఁడనే-
మాలినీ ! ఎవరినైనఁ బిలువుము.

మా—ఎవరక్కడ ?

[నేపథ్యమున] అమ్మా.

వ—నీవు కారాగృహాధిపతియొద్దకుఁ బోయి నారాయణవర్మ నిటకుఁ బంపుమని నేను జెప్పినట్లు చెప్పుము. వచ్చునప్పుడు రత్నప్రభనుగూడఁ దీసికొనిరమ్ము.

[నేపథ్యమున] చిత్తము.

వ—మాలినీ- వారు వచ్చునప్పుడు మే మిక్కడ నుండవచ్చునేమో యడుగుము.

ము—అభ్యంతరమేమి? మాలినీ! రవంత నాకుఁ జేయూఁతనిమ్ము.

మా—ఎందులకయ్యా- లేచెదరా యేమి?

ము—చక్రవర్తిని యటుఁ గూరుచుండగ నేను మంచముపైఁ బండుకొనుట తప్పుకాదా?

మా—చక్రవర్తినిగూడ మీతో మంచముపైఁ బండుకొనవలసిదని మీ యభిప్రాయమా?

వ—ఛీ! దౌడపైఁ గొట్టెదను.

(నారాయణవర్మయు రత్నప్రభయుఁ బ్రవేశింతురు.)

ము—నారాయణవర్మా! అకారణముగ నేను నీవలన శిక్షితుఁడనై యిటఁబడియున్నాను. నేఁడు పవిత్రుఁడను. నా కాషాయమునైన నీవు గౌరవింపవైతివి. మీ కిద్దఱకుఁ ప్రారబ్ధవశమునఁ గొన్ని దురభిప్రాయములు కలిగినవి. ఎవరిదారిని వా రుండవచ్చును. మీరత్యంత సన్నిహితబంధువులు, నా కపకార మొనర్చిన వారి కైన నుపకార మొనర్చుట సన్న్యాసినైన నావిధి- నారాయణవర్మా! తల్లీ రత్నప్రభా! మీ రిటు రండు. మీ యిద్దఱచెవులలో సర్వకష్ట తారకమైన మంత్ర ముపదేశింతును.

(నారాయణవర్మ- రత్నప్రభ సందేహించి యూరకుందురు.)

వ—రత్నప్రభా! అటుపొమ్ము. నారాయణవర్మతో మాలినీ! నా యాజ్ఞ యని చెప్పుము.

ణవర్మ చెవిలోను రత్నప్రభ చెవిలోను మురళీమనోహరుఁడు)
గుసగుసలాడును.)

—ఆహా! ఎంతటి మంత్రిరాజ ముపదేశించితివయ్యా! నాజన్మము
తరించినది రత్నప్రభా! క్షమింపవలయును.

—నారాయణవర్మనేమి, రత్నప్రభనేమి క్షమింపవలయునని కోర
వలసిన దానను నేను.

—అమ్మా! కృతార్థులమైతిమి మహానంద మొసఁగినావు.

—(కౌఁగిలించుకొని) రత్నప్రభా! మన కందఱకు భగవంతుఁడు
మహానంద మిచ్చినాఁడు.

—నారాయణవర్మా! నాకు రనంత యూతనిమ్మా నేను లేచి
నాప్రియురాలి జేరెదను.

—(అట్లొనర్చును)

—ఈ రెండు వివాహములకుఁ బ్రధానోత్సవములకు గొనకిఁ బోద
మురండు.

—ఔను. ఇఁక నిక్కడఁ గావలసిన దేమున్నది.

—గీ. ధరణి యీతిబాధలు లేక తనరు గాక
ప్రజల యన్యోన్యవైరముల్ పాయుఁగాక
కవిత రాజపోషణమునఁ గ్రాలుగాక
నీతిపాలనమున రాజు నెగడుగాక.

—తథాస్తు.

ఇంతటితో సర్వము సంపూర్ణము.



# సాక్షి.

**అచ్చుపడి సిద్ధముగ నున్నవి! కొలదిప్రతులుమాత్రమే గ**

ఇదియొక యపూర్వగ్రంథరాజము. కథకాదు, ప్రబంధముకాదు, నవల కన్నకాదు. తెలుఁగుభాషలో నిదివఱ కెన్నఁడు నిట్టిగ్రంథరాజముఁ జూచియెఱు జంఘాలశాస్త్రి కాలాచార్యులు, బొఱ్ఱయ్యసెట్టి, వాణీదాసుఁడు, సాక్షి అను గురు సంఘము. ఈసంఘముచేఁ జర్పింపఁబడు విషయములు బహుచమత్కార నతిమనోహరముగ, హృదయానందకరముగ నుండును. మొదటినుండి చివరవఱకును పు చెక్కలగునటుల నవ్వు వచ్చుచుండును మనోహరమును ప్రాణగంభీరము నగు ఉదుర్చుకొనుటకు విద్యార్థుల కింతకన్న నుపయోగకరమగు గ్రంథము లేదు. జంఘ శాస్త్రియుపన్యాసధోరణి, వాణీదాసు బంధురప్రబంధరచనాసక్తి, కాలాచార్యుల నానైపుణి, సాక్షి విషయనివేదనావైఖరి, అభిప్రాయసమంజసత చదువఁదగినవి. ఒ యెడ సంభాషణచాతుర్యము, ఇంకొకయెడ పాత్రవిలసనవైఖరి, మఱియొకయె అపూర్వవర్ణనాగాంభీర్యము చదువరుల కెంతయో సంతస మొసఁగును. ఆంధ్రవి సారస్వతానుబంధమునందలి "సాక్షి" సాదరముగ, సాంతముగ, సమ్మోదభరితు చదివి, యందలి యపూర్వభావకల్పనాచమత్కృతి, వచనరచనానైపుణ్యము, పదల త్యము, అనిర్వచనీయమై- ఆహ్లాదజనకమై హాస్యరసామృతమును మనసార గ్రో యానందించు ఆంధ్రలోకము, జంఘాలశాస్త్రి యుపన్యాస మొక్కవారము ర యెడల పొందెడి పరితాపము వర్ణనాతీతముగదా! ఇది యాంధ్రలోకమునకు, ఆం వాఙ్మయమునకు నవీనము. నానావిషయముల గూర్చి మనోహరమగు శైలిలో వ్రాయఁ బడిన వ్యాసములు. ఈవ్యాసములు చదివినకొలఁది చదువవలయునని యుండును. తీ తీఱదు. తృప్తికలుగదు. ఒక్కవ్యాస మెన్నిసారులు చదివినను విసుఁగు జనింపకపోవు టయే కాక చదివినకొలఁది వింతవింత రుచుల నుప్పతిలఁజేయుచుండును. చక్కని ద సరి కాగితములపై సుందరముగ ముద్రింపఁబడియెను. దిట్టమైన యట్టబైండు.

| | | | |
|---|---|---|---|
| మొదటిభాగము | 2-0-0 | మూడవభాగము | 1-8-0 |
| రెండవభాగము | 2-0-0 | నాల్గవభాగము | 1-12-0 |

వలయువారు: పానుగంటి రాజారావు బ్రదర్సు,

పిఠాపురము,

(గోదావరిజిల్లా.) అని వ్రాయవలెను.